# కన్నవి : విన్నవి

Kannavi కథలు : Vinnavi

## మొదటి భాగం

మొక్కపాటి నరసింహశాస్త్రి

మొక్కపాటివారు

* మదరాసు *

# ఇందులో కథలు.

—□—

అసలు మా ఆవిడా నేనూ అని రాద్దామనుకున్నాను. నాగరికపు పద్ధతి ననుసరించి ఆడవాళ్ళని ఎక్కువ గౌరవించాలి గదా. అందుకని ముందు మా ఆవిడనే రాద్దా మనుకున్నాను. కాని నా మట్టుకు ఆ పద్ధతి నచ్చలేదు. అంటే ఆడవాళ్ళమీద గౌరవంలేక కాదు. ఉంది. స్త్రీలూ పురుషుల తోటి సమానులే అనీ, సమానమైన గౌరవమునే పొందదగ్గ వాళ్ళనీ, అభిప్రాయం ఉన్నవాళ్ళల్లో వాడినే నేను. అందుచేతనే ఇదివరకు ఎప్పుడూ ఆడవాళ్ళు-అంటే ఎరిగున్న వాళ్ళెవరేనా-కనబడితే దణ్ణం పెడుతోండేవాడిని. వాళ్ళు మట్టుకు అజ్ఞానంచేత 'ఇదేమిటి ఈ వెఱ్ఱివేషం, అనుకునే వాళ్ళు కొందరు. నా శ్రేయోభిలాషులు (మా అమ్మమ్మ, మేనత్త వగైరా) నన్ను చివాట్లేశారుకూడాను, ఇది శ్రేయస్కరమైన పని కాదని.

వాళ్ళకి నా అభిప్రాయం ప్రకారం స్త్రీలుకుడా పురుషుల వంటి వారేననీ, గౌరవార్హులనీ, వాళ్ళకికూడా స్వాతంత్ర్యం అవసరమనీ, విద్యాగంధంలేక ఇట్టి దురవస్థలో ఉన్నారనీ ఎవళ్ళ ఆడవాళ్లని- వాళ్లు గౌరవించకపోతే ఇతరులు అసలే గౌరవించరనీ, ఇటువంటి ఉద్దేశాలన్నీ వాళ్ళకి చాలాదూరం బోధచేశాను.

మన ఆడవాళ్ళకి, అందులో ముఖ్యంగా పెద్దవాళ్ళకి ఇప్పుడు చదువు ఎలాగూ రాదు. కనుక వాళ్ళకి జ్ఞానోపదేశం చెయ్యాలీ అంటే తరుణం కనిపెట్టి ఇటువంటి చిన్న ఉపన్యాసా లిస్తోంటే మంచిదని నా అభిప్రాయం. అందుచేత అవకాశం చిక్కినప్పుడు ఎప్పుడూ 'నేను వృధాగా పోనివ్వను

నా లోపం లేకుండా నేను చెప్పగలను. కాని వాళ్లు వినక పోతే నేనేమి చెయ్యను. నేను చెప్పినదంతా విని పని ఈ కాలంలో ఎప్పుడూ కని విని ఎరుగని వింతలన్నీ బయలు దేరుతోన్నాయనీ, ఆడవాళ్ళ నెప్పుడూ నెత్తి నెక్కించుకో కూడదనీ, అలాచేస్తే మర్యాద దక్కనివ్వరనీ, ఎప్పుడూ ఒక కాలికింద నొక్కి ఉంచాలనీ, వాళ్ళు మళ్ళీ నాకు హితోపదేశం చేశారు.

నాకు వివాహమై మా ఆవిడ కాపరానికొచ్చిన తరవాత నా పూర్వపు ఉద్దేశాలన్నీ మార్చుకున్నాను. మా అమ్మమ్మా వాళ్ళు చెప్పిన మాటలయొక్క నిజానిజా లిప్పటికి బాగా తెలిశొచ్చాయి. కష్టాలు బాగా నాటుతేనేగాని పెద్దవాళ్లమాటలు నమ్మ బుద్ధికాదు.

నేను స్కూలుఫైనలు ప్యాసయి ఇంటర్మీడియేటు ఒకటి రెండు సంవత్సరాలు తప్పి లాభంలేదని వదులుకున్నాను. పరీక్ష ప్యాసయినంత మాత్రాన్ని విశేషజ్ఞుడనికాని, తప్పినంత మాత్రాన్ని కించిజ్ఞుడనికాని అనుకోడానికి వీలులేదని నా అభి ప్రాయం. నేను ఇంటర్మీడియటు తప్పడానికి అనేక కారణా లున్నాయి. ప్రస్తుతాంశానికి సంబంధించక పోవడముచేత ఆ కారణాలన్నీ ఇప్పుడు చెప్పదలచుకోలేదు. పరీక్షలో ఉత్తీర్ణుడను కాకపోయినా విశేషంగా గ్రంథావలోకనం చేసిన వాడనని నా నిశ్చితాభిప్రాయం.

పాశ్చాత్య విద్య బాగా అభ్యసించినవాడిని గనుకనూ, వాళ్ళ నాగరికతా పద్ధతులు బాగా తెలుసుకున్నవాడిని గను కనూ చదువుకున్నపిల్లనే కాని పెళ్ళిచేసుకో కూడదను కున్నాను. వెతికి వెతికి నాకు నచ్చిన పిల్లనే పెళ్ళి చేసు కున్నాను. నా దగ్గిరకొచ్చిన తరవాత నేనూ కొంత చదువు

చెప్పాను. నెత్తిమీద పెట్టుకునేవాడిని. అన్ని విధాలా ఏమీ లోపం లేకుండా సుఖపెట్టవలెనని ప్రయత్నం చేసేవాడిని. దాన్ని పేరెట్టి పిలిచేవాడిని (ఎవ్వరూ లేనప్పుడు). నన్ను పేరెట్టి పిలవమనేవాడిని. అలా పిలవకపోతే పలికేవాడిని కాను. నన్ను బహువచనంలో సంబోధిస్తే ఒప్పుకునే వాడిని కాను.

పోనీ ఐశ్వర్యానికేమన్నా లోటా అంటే నాకూ భూములవల్ల సాలుకి ఏవో రెండుమూడు వంద లొచ్చేవి. నాకు చెన్న పట్టణంలో ఒక గొప్ప కంపెనీలో నెలకి ఏభైరూపాయీలు జీతం. క్రమేణా అయిదు వందలదాకా ప్రమోషను అవడాని కవకాశం ఉంది. నే నంటే మా కంపెనీ దొర్లకి చాలా అభిమానం, నమ్మకం, గౌరవమూను. నా కింకా పిల్లా మేకా గాని, నా మీద ఆధారపడి ఉన్నవాళ్లుగాని ఎవ్వరూ లేరు. ఇంత ఉందనీ, ఇంత నెత్తిమీద పెట్టుకుంటున్నాననీ, నే నంటే మా ఆవిడకి ఏమన్నా గౌరవముందా? ఏమీలేదు. దమ్మిడీ ఎత్తు లక్ష్యంలేదు. నా మాట వినకపోవడం, నేనంటే వేళాకోళం చెయ్యడమూను. నే నేమన్నా చెపుతోంటే, "అబ్బ! మీకు తెలియదు, ఊరుకుందురూ" అనడం ఎంత మందున్నాను.

అటువంటిస్థితిలో పూళ్ళో నాకు యెంత గౌరవము జరిగితే ఏమి. ఇంట్లో లేనప్పుడు. అక్కడికీ చెప్పాను పూళ్ళో నే నంటే ఎంత గౌరవమోను. చెప్పినా తెలుసుకోలేక పోయింది. పైగా దానికో వేళాకోళము. కాదు మాటవరసకి చెపుతాను. నే నెప్పుడేనా బజారుకెళ్ళి ఏ కూరో నారో తీసుకు వస్తానా-సాధారణముగా మా నౌఖరే తీసుకొస్తాడు. ఎప్పుడో కాని నేను వెళ్ళనే వెళ్ళను-తీసుకురాగానే మా ఆవిడ

కూరలు మంచివి కావనీ, ముదురు పెంకులనీ, బోదికాలవలో పారెయ్యాలనీ, ఖరీదు ఎక్కువ పెట్టేననీ, అందుకనే నన్నె ప్పుడూ బజారుకి వెళ్ళవద్దంటుందనీ, వీధిలోకి వచ్చినప్పుడే ఎప్పుడూ తనే కొనుక్కుంటుందనీ, బుద్ధి గడ్డితిని వెళ్ళ మన్నందుకు తగిన శాస్తి జరిగిందనీ, యింకా యే మేమిటో ఎన్నెన్నో చదువుతుంది.

నేను అనేక విధాల చెప్పాను శాంతం ప్రధానమని, అందులో స్త్రీలకు అది అమూల్యమైన భూషణమనిన్ని. ఎన్ని చెపుతే ఏమీ ప్రయోజనము! పక్కభాగంలో కాపురం వున్న వాళ్ళు వింటారనేనా భయములేదు. నా లోపం లేదనీ కూరలు మంచివేననీ నెమ్మదిగా చెపుతూన్నమాటలు విని పించుకోదు. నేను బేరము లోపమేమన్నా చేశానా. కూరల వాడు వీశ అరణాలు చెపితే నేను పావలాకి అడిగాను. వాడు ఐదణాలముక్కానికి ఒక్క దమ్మిడీ తక్కువ యివ్వ నన్నాడు. అందుచేత ఐదణాలకడిగి వాడు ఇవ్వనంటే పోతూన్నవాడిని నన్ను మళ్ళీ పిలిచి, "బాబూ తమబోటి ప్రభువులే యిలా కానీకీ అర్ధణాకీ బేరమాడితే ఎలాగండి! ఒక డబ్బు తమరివ్వకపోతే మాబోటివాళ్ళు బతకడ మెలా గండి? వంకాయలు మంచివండి, నేను కొన్న ఖరీదుకే యిస్తున్నానండి, తమకి గనుక అలా యిస్తున్నాను. అయి దణాలన్నరచేసి పుచ్చుకోండి" అని నేను వద్దంటూంటేనే కాయలు తూచి నా వళ్ళోపోసి డబ్బులిమ్మన్నాడు. అదేమిటి కాయలు ముదురువేమో నేను చూడలేదంటే "చూడక్కర లేదండి. లేతపువ్వులు యేరివేశానండి. నేనలా అన్యాయము చేస్తానా అండి! తమరు యింటికెళ్ళి చూసుకొని బాగుండక పోతే రేపు నా మొహాన్ని గిరాటెట్టండి" అని ప్రాధేయపడ్డాడు.

వాడు చాలా పెద్దమనిషివలెనే కనుపించాడు. లేకపోతే నన్నంత గౌరవముచేసి కొన్న ఖరీదుకి ఎందుకిస్తాడు. ఇదంతా మా ఆవిడకి బోధపరిచాను. "అదే మీ వెర్రితనము అంటేను. మీ అంతటివారు లేకంటే సరి యింక వంటిమీద గుడ్డుండదు చూడండ"ని వక వంకాయ తరుక్కొచ్చి చూపించింది. వట్టి గింజలపోగు. దానితోటి వర్తకుడు కొంచెము మోసము చేశాడేమో అని అనుమానము కలిగింది. అయినా పొరపాటున ఒక ముదురుకాయి వుండకూడదా! వాడుమాత్రం ప్రతి కాయలోను దూరిచూశాడా! అనుకున్నాను. ఇంతట్లోకే వీధిలో వంకాయలకేక వినబడ్డది. మా ఆవిడ వీధిలోకి పరుగెత్తికెళ్ళి వాణ్ణి పిలచి వంకాయిల ధర అడిగింది. అడుగితే వాడు పావలా చెప్పేడు. మా ఆవిడ అణా కడిగింది. వాడు కోపమువచ్చి నాలుగు కేకలేసి చక్కా పోయాడు. మళ్లీ వెనక్కొచ్చి మూడణాలన్నర యిమ్మనీ, మూడణాలనీ, బేడేనా యివ్వకపోతే బతకడ మేలాగనీ, చివరకి అరుకాన్లకి యిస్తానన్నాడు. కాయలుకూడా నే తెచ్చిన కాయలకంటె బాగానే వున్నట్టు కనిపించాయి. నా కళ్ళకి కూడాను. నా కమ్మిన వర్తకుడు మోసముచేసినట్టు రూఢి అయింది.

"చూశారా నేను అంటే మీకు కోపముగాని, మీరు తెచ్చిన కాయలకీ యీ కాయలకీ తేడా చూశారా! ధరమట్టుకు ధర నాలుగు వీశెల వంకాయల ఖరీదుపెట్టి వక వీశెడు కొన్నారు గదా. పోనీ తెచ్చినవి కొంచెమేనా తెచ్చారా నాలుగు వీశలు గింజల పోగులు తీసుకొచ్చి నా మొహాన్ని తగలేశారు. ఉన్నది యిద్దరు మనుష్యులముగదా యిన్ని ఏమిచేవామని తీసుకొచ్చా'రని ఆరంభించింది.

ఇంతవరకూ వచ్చినదాకా వుండి మొగవాడైనవాడికి ఎంత శాంతమూర్తి అయినా ఎంత స్త్రీ స్వాతంత్ర్యవాదైనా కోప మొస్తుందంటారా రాదంటారా! కోపము రావటంలో ఆశ్చర్య మేమున్నది. నాకు కోపము వచ్చింది లేదనను. నాప్రాణము విసికింది. దాన్నేమన్నా మళ్ళీ అంటే అది అఘోరిస్తుంది. దాన్ని అని ఏమి ప్రయోజనం. జ్ఞానమున్న మనిషి నయితే అన్నా అందం చందమును. అలాంటి మనిషే అయితే వూళ్ళో నా కున్న గౌరవాన్ని పట్టేనా తను జాగ్రతగా సంచ రించుకునేది. అలాంటిదేమీ లేంధే.

నాకు మర్యాద జరిగేచోటికే వెడదామని అది చెప్పే మాటలు వినిపించుకోకుండా స్వతంత్రము కలవాడిని గనుక వీధిలోకి చక్కాపోయాను. వీధిలోకొస్తే కావలసినంత పలుకు బడి. అంతా ఓహెూ ఓహెూ అనేవాళ్ళూ, హల్లో అనేవాళ్ళూ, గుడ్‌మార్నింగనేవాళ్ళూను. అదేమిటోకాని నేను ఎక్కడకు వెళ్లినా అంత మర్యాద. మళ్ళీ నా వేషభాషలలోకాని రూపురేఖ లలోకాని ఏమన్నా విశేషముందేమో అంటే అదేమీ కనిపిం చదు. మామూలుగా అందరు కట్టుకునే మల్లుబట్టే నేను కట్టు కోవడం, అందరు తొడుక్కునేలాంటి చొక్కాలూ కోట్లే నేనూ తొడుక్కోవడమున్నూ. మామూలు రూపాయిపావలా టోపియే నే బెట్టుకోవడమున్నూ. అయినా ప్రపంచమంతా తక్కిన వాళ్ళకంటే నన్ను ఎక్కువ ఎందుకు గౌరవించాలి. కొంత నాలో ఏదో విశేషముందనే నా దృఢనిశ్చయము.

ఒకసారి నేను కాఫీహెూటలుకు వెళ్ళాను. అనేకమంది వస్తూపోతూ ఉన్నారా! నన్నుమట్టుకు పెద్ద గౌరవంగాను, ప్రత్యేకం ఒక బల్లదగ్గరికి తీసుకెళ్లి, దయచెయ్యమని, "ఒరేయి! పంతులుగారు ఎండలో శ్రమపడి వచ్చారు.

నాలుగు అవడలు తీసుకొచ్చియ్యి చల్లగా ఉంటుంది" అని ఒక కుర్రవాడిని కేకేశాడు హొటలు యజమాని. నే ససలు ఆవడలు తినదల్చుకోలేదు. ఆ రోజున పోనీ తెచ్చాడుగదా. వద్దనడమెందుకని ఊరుకున్నాను. అవి పూర్తిగా తినకుం డానే, "ఒరేయి, పంతులుగారికి ఖారంగా ఉందేమో, ఒక బేడ హల్వాతీసుకురమ్మన్నాడు. నాకు తీపి ఎంతమాత్రం ఇష్టంలేదు. అయితేమట్టుకు ఏమిచెయ్యను. పెద్దమనిషి తీరా తెచ్చినతరువాత వద్దనడం బాగుండదు. నే నెంతసేపూ గౌరవంకోసం ఆలోచించేవాడినే కాని వెధవడబ్బు లెఖ్ఖ చూసుకునేవాడిని కాను. హితవు లేకపోయినా కష్టపడి తింటోంటే, "బాబూ బంగాళాదుంప బోండా నిండా బాగుం డును సార్" అని అది తెప్పించాడు. ఇలా ఒకదాని తరు వాత ఒకటి వాడు తీసుకొచ్చి అక్కడ పెట్టడం నేను వద్దన డానికి మొహమాటపడి తినడమును. మొత్తం పన్నెండణా లన్నర అయింది బిల్లు ఆ రోజున. అసలు అయిదుకానులు ఖర్చుపెట్టి, ఒక అర్ధణా కారపుబూంది, అరకప్పు కాఫీ పుచ్చుకోవాలని వెళ్ళాను.

ఇప్పుడు డబ్బు పోయిందనికాదు. నా కదో లెఖ్ఖా ఏమిటి నా కక్కడ జరిగిన మర్యాదకి చెపుతాను. అక్కడికి రోజూ అన్ని వందలమంది వచ్చిపోతోంటే నన్ను ప్రత్యేకంగా అంత ఎక్కువగా గౌరవించడానికి కారణమేమిటి. నాలో ఏదో విశేషం ఉండడంచేతకదా. లేకపోతే నన్ను అంత శ్రద్ధగా కనుక్కొని బలపంతపెట్టడ మెందుకు. ఈసంగతి మా ఆవిడ తోటి మాటల సందర్భాన్ని చెప్పాను. అపాళంగా పెదవి విరిచి 'అవును, మీబోటి వెర్రివాళ్ళూ స్తోత్రప్రియులూ లేక పోతే వాళ్ళ సరుకులు అమ్మకం కావడం ఎలాగ: వాళ్లు

బాగుపడడం ఎలాగ' అని అరంభించింది! 'నీవు ఆడదానవు. నీకు ప్రపంచం సంగతి ఏమీ తెలియదు. ఊరుకో'మని నాలుగు చివాట్లేశాను. అయినా ఆడవాళ్ళకంత అతిఘోరణి పెరగనివ్వకూడదు.

ఈ పైఒక్క విషయాన్ని బట్టేకాదు నాకు ఊళ్ళో ఇంత గౌరవమందనుకోడం. మా బావమరిది చిన్న కుర్రాడు; పదే ళ్ళవాడు. రిస్టువాచీ కావాలని రాగాలెట్టాడు. పనిచేసినా చెయ్యకపోయినా, ఏదో తక్కువ ఖరీదులోఒకటి కొనిద్దామని ఒక చిన్న షాపులోకెళ్ళాను. వెళ్ళి నాకొక చిన్న రిస్టువాచీ కావాలని అడిగాను. నన్ను నిదానంగా చూశి, బాబూ; ఇది తమపోటి ప్రభువులు రాదగ్గ షాపుకాదండి. ఇది బీదవాళ్ళ దుకాణమండి. ఇక్కడుండే సరకులన్నీ చాలా తక్కువ ఖరీదండి' అన్నాడు. నేను గొప్పవాడినని వాడు ఏలాకనిపె ట్టాడనుకుంటూ, 'పరవాలేదులే, మా నౌకరు కుర్రాడికివ్వాలని ఆలోచిస్తాన్నాను. అట్టే ఎక్కువ ఖరీదులో అక్కరలేదు. నీదగ్గర ఉన్నవాట్లల్లో తక్కువ ఖరీదులోనే మంచిరకం ఇమ్మన్నాను. పదిహేను రూపాయలు ఖరీదుగల గడియారం ఒకటి తీసుకొచ్చి ఇంతకంటె తక్కువరకం లేద' న్నాడు. నేను ఖర్చు పెట్టదలచుకొన్నది అసలు రూపాయిఐనా దర్జా కేమిలోటొస్తుందోనని పదిహేను రూపాయలూ వాడి కర్పించి గడియారం కొనుక్కొచ్చాను.

తన తమ్ముడికి బహుమతి తీసుకొచ్చినందుకు సంతోషి స్తుందిగదా అని మా ఆవిడ దగ్గిరకెళ్ళి 'ఒక తమాషా తీసుకొ చ్చాను. చూపిస్తే ఏమిస్తావ' న్నాను. 'ఏ రూపాయో రెండో పెట్టి ఎందుకూ పనికిమాలిందేదొ కొనుక్కొచ్చారు కామాల్ను. దానికో బహుమతీకూడా ఎందుకు; చూపించండి' అంది.

నా ఉత్సాహం కొంతతగ్గింది. కావడం అది నవ్వుతూ అన్నా నా మనసు చివుక్కుమంది. ఇంతట్లోకే నిరుత్సాహ పడకూడ ననుకుని పోతున్న ధైర్యాన్ని చిక్కబట్టి, 'పోనీ పనికొచ్చే వస్తువు అయితే ఏమిస్తా వ'న్నాను. 'ఇవ్వడానికేముంది నాద గ్గర. మళ్ళా మాన్యాలా. మీరిచ్చిన డబ్బా, పెట్టిన నగలా, ఏముందని సరే, అదేమిటో ముందు చూపిద్దురూ' అంది. ఎలాగైనా తప్పకుండా సంతోషిస్తుందని ధైర్యంతో, 'నాకేమీ వద్దులే, ఒక్క ముద్దిమ్మ'ని జేబులో గడియారంతీసి చూపిం చాను, చూసి తెల్లబోయి నామొహంకేసిచూసి ఇదేమిటండి' నాకాళ్ళు చల్లపడ్డాయి. ముద్దుమాట దేముడెరుగును. చివాట్లు తప్పితే చాలనుకున్నాను. 'అప్రశ్నేమిటీ, కనపడ్డంలేదా; గడి యారం' అన్నాను. 'అవున్లెండి ఆ సంగతి తెలుసును. మీకుంది కాదా మళ్ళీ ఎందుకు కొన్నారు? ఖరీదెంత' అంది. ఇంతేకదా పరవాలేదనుకుని 'నాకుకాదు. మీ తమ్ముడికి బహుమతీ పదిహేను రూపాయిలు ఖరీదు' అన్నాను. బొట కనవేలూ మధ్యవేలూ రెండు బుగ్గలమీద పెట్టుకుని తర్జని ముక్కుమీద మోపి, ఎడం చెయ్యి నడ్డిమీద పెట్టుకుని. 'అయ్యయ్యో! ఇదేమి పాపమండి. మీరెప్పుడు ఏ పనిచేసినా ఇంతేనేమండి. ఇప్పుడు కుర్రకుంక కింత గడియార మెందు కండి. ఒకటీ రెండూ కాదు పదిహేను రూపాయిలు. అడదా నికి నాకే తెలుస్తోంటే మీకామాత్రం తెలియదేమండి ఇది రెండు రూపాయలకంటె ఖరీదు చెయ్యదు. మూడు రోజుల కంటె పనీ చెయ్యదు. ఏమన్నా అంటే మీకు కష్టం, నాకు చివాట్లూను. డబ్బు ఇలా తగలేస్తే ఎలాగ కాపరంచెయ్యడం మనమేమన్నా జమీందార్లమా ఏమిటి' అని మామూలు సాదింపు ఆరంభించింది. ఇంక ఏ పనిచేసినా దానిమెప్పు

పొందలేము. దానికి సమాధానం చెప్పకపోవడమే మంచిది. గడియారం చేసే పనినిపట్టి దానివిలువ అదేతెలుసుకోగలదు. అనవసరంగా అన్నానంకదా అని అప్పుడే అది పశ్చాత్తాప పడగ లదని ఏమీ సమాధానం చెప్పకుండా మొగాడిని గసక వీధు లోకి షికారెళ్ళాను. కాని ఏ కారణంచేతనో కాని నాలుగోరో జున ఆ గడియారం ఆగిపోయింది. ఎన్నితంటాలుపడ్డా మళ్ళీ తిరగలేదు. కొన్నదుకాణం వాడిదగ్గిరకెడితే. నేనెవరో ఎరగ ననీ, తను నా కెప్పుడూ గడియారం అమ్మలేదనీ చెప్పాడు. ప్రపంచకంలో ఇంత మోసంఉంటుందని ఎలాగుతెలుస్తుంది.

ఈమధ్య నొకసారి నేనొక పల్లెటూరు వెళ్ళవలసి వచ్చింది. వెళ్ళి అక్కడ పనిచూచుకుని తిరిగివస్తున్నాను. దార్లో వర్షం వచ్చింది. నిలవడానికి చెట్టునీడేనాలేదు అలాగే వస్తున్నాను. నా వెనుకో ఇద్దరు కాపులుకూడా వస్తున్నారు, వాళ్ళు నన్ను పలకరించి మాదేపూరో అడిగారు. చెన్నపట్టణమన్నాను. 'బాబూ గొడుగు లేకుండా దయచేశారేమండి' అన్నాడు అందులో ఒకతను. నాకసలు గొడుగులేదని చెపుదామను కుంటూ ఉంటే, రెండవకాపు 'నువ్వు ఎప్పుడూ అలా అడగ కూడదు. వారిబోటి ప్రభువులు తాటాకు గొడుగు మొయ్య లేరు. పోనీ గుడ్డగొడుగు తీసుకురాకూడదా అంటే దాని గౌరవం పోయింది. ప్రతివాళ్ళూ ఇప్పుడు గుడ్డగొడుగు చంకనెట్టేవారేను. కూటికి లేకపోయినా గుడ్డగొడుగు తప్పదు. అందుకని ఇలాంటి జమిందార్లు గొడుగు తేవడం మానుకున్నారు, గొప్పవారిచేతులోఎప్పుడూ నాకు కనబడదు నువ్వు వారిని అడగక్కరలేదు. ఇదే కారణం' అన్నాడు. ఇది వినేటప్పటికి నాలో నాకే నవ్వు వచ్చింది.

ఇలాకొంతసేపు ఆమాటా ఈమాటా మాట్లాడి 'బాబూ తమ

మాటేనా ఇలా ఇప్పించండి. నేను తీసుకొస్తాను. తమరు ఈ వర్షం కురిసినమీదట బొత్తిగా నడవలేకుండా ఉన్నారు.' అన్నాడు. అనగానే మళ్ళీ అతనిమనను మారకముందు కృతజ్ఞతతోటి అమాట అతనికిచ్చి పాటకజనంయొక్క అజ్ఞానానికి విచారిస్తూ, నాబోటి అధికులయెడ వాళ్ళకిగల సహజగౌరవానికి సంతోషిస్తూ, 'నాకెప్పుడూ నడకన్నమాట అలవాటులేదు. ఇలాంటి వెధవపూళ్ళకి బండేనా రాదు. పోనీ సవారీచేయించుకుందాము అంటే అంతా పనులకిపోయి మనుష్యులు దొరికారుకారు. చాలా అవస్తగాఉంది' అన్నాను.

వాళ్ళతోటి నేను ఫలానా అనికాని. నా ఉద్యోగం ఇదనికాని, నా ఆస్తిసంగతికాని ఏమీ చెప్పలేదే. వాళ్ళకినేనంటే అంత గౌరవం ఎందుకుకలగాలి నామాట తీసుకువచ్చేదాకా వాళ్ళకేమి అవసరం, నా అధిక్యత నాముఖంలో కనబడడంచేతనే

ఓమాటు మా వూరునుంచి చెన్నపట్నం వస్తున్నాను. కొంత సామాను గార్డుపెట్టిలో వేశాను. చెన్నపట్నంలో దిగ్గానే సామానుకోసం వెళ్లాను. నా పెట్టెలతోపాటు ఇంకా రెండు పెద్ద పెట్టెలు దిగాయి. వాట్లమీద స్పష్టంగా "కె. వెంకట సత్య సూర్యనారాయణ ప్రకాశ నరశింహరావు బహద్దర్ ప్రొప్రయిటరు. జిల్లేళ్ళమూరా" అని ఉంది. "ఇవికూడా మీ వేనా అండి అన్నాడు బంట్రోతు. నేను జమీందారునని" అతను భ్రమపడ్డానికి కారణం ఏమిటి. నాలో ఏదో విశేషం ఉండడం చేతనేకదా.

ఇంటికొచ్చి మా ఆవిడని 'నా ముఖంలో ఏమైనావిశేషం కనబడుతోందా, అని అడిగాను. నన్ను ఎగాదిగా ఈ పక్కా ఆ పక్కా చూచి 'ఊఁహుఁ, ఏమి కనుపించదు, చిన్నప్పుడు

మీవాళ్ళు మొహంమీదా కణతలమీదా కాల్చినమచ్చలుతప్ప. ఆఁ అన్నట్టు మీరు ట్రామ్‌మీదనుంచి పడి రెండేళ్ళకిత్రం గడ్డంమీద తగిలించుకున్న దెబ్బమచ్చ ఒకటుంది. అంత కంటె ఏం కనుపించదు. అయినా ఏమి అలా అడిగారు' అంది.

ఈ రైలుసంగతంతా చెప్పి ఎందుచేతను ప్రజలంతా ఇలా భ్రమపడతారా అని ఆలోచిస్తున్నాను అన్నాను. అనేటప్పటికి కడుపు చెక్కలయ్యేటట్టు నవ్వి "మిమ్మల్నిచూచి గుడ్డి ముండావాడేనా జమీందారనుకోడు,. కంపెనీలో గుమస్తా అని మీ మొహాన్ని మూడుపంక్తులా రాసివుంది. వర్తకులు మిమ్మల్ని మోసంచెయ్యడానికి అలా అంటారు. అనేకసార్లు మీరలా మోసపోయారు. నేనుచెప్పితే వినరు. మీకుతెలియదు. పాటక జనం చొక్కా తొడుక్కున్న వాళ్ళనందరినీ అలాగేస్తోత్రం చేస్తారు. వాళ్ళకి పట్నవాసం సంగతి తెలియదు. ఇకనేనా మీరిలాంటివెర్రిభ్రమలు మానెయ్యండి"అంది! ఉపన్యాసాలకి లోటేమిటి. అసలే ఆడది. అందులో కొంచెము దొక్కశుద్ధి అయినదాయెను. తదుపరి మొగుడు మెత్తనివాడు. ఇంక నోరెలా ఊరుకుంటుంది.

మొగుడంటే ఇంత నిర్లక్ష్యంగా ఉన్న మనిషితోటి ఏం చెప్పను. ఎలాగు ఈలాటి మనిషిని ప్రేమించడం. చదువుకున్నంత మాత్రాన్ని మొగుణ్ణి తృణీకరించమని ఎక్కడుంది. ఎప్పుడేనా ఒకసారి వేళాకోళం అంటే వొప్పుకుంటాను. అదేమీలేకుండా ప్రతిదానికీ ఒకే పద్ధతిగాయతి అంటే ప్రతి. నేను చెప్పినదానికల్లా వ్యతిరేకంగా చెప్పడమే. కాని నా మాటలో సబబు ఆలోచించదు. అందుకనే పెద్దలు (మా అమ్మమ్మ వగైరా) ఆడవాళ్ళకంత స్వతంత్రం కూడదన్నారు. ఇప్పటికి నాకు బాగా నాటింది ఆ సంగతి.

నేనూ మా డాక్టరూ ఇంకొక ఇద్దరు స్నేహితులూ ఒకరోజు సాయంకాలము క్లబ్బువరాండాలో కూర్చుని బాతాఖానీ కొడు తుండగా బహు నీటుగా దుస్తులు ధరించి ఎంతమందితో ఉన్నా ప్రత్యేకంగా కనపడేటట్టు. సుబ్బుడువచ్చాడు - నాకేసి చూసి చిరునవ్వునవ్వి లోపలికి చక్కాపోయాడు. మా డాక్టరు అతను లోపలికి వెళ్లేవరకూ రెప్పవాల్చకుండా అతని కేసే చూచి "ఎవరండీ ఆయనా" అన్నాడు నాతో.

అతన్ని ఎరుగరూ! ఎవరు! మన బండసుబ్బుడూ! మీరు ఎరక్కపోవడ మేమిటండీ! మన హాస్టలులో Petrol Tank లా ఉండేవాడు. వాడిని ఎరగకుండా ఉండడానికి వీలులేదే! వెనుక మీరున్నప్పుడు మన క్లబ్బులోకూడా మెంబరుగా ఉండేవాడండి. మీరు వాడిని ఎరుగకపోవడము చాల ఆశ్చర్యమే!

నేను వాడిని చిన్నప్పటినుంచీ ఎరుగుదును. నాకంటె ఒక్క క్లాసు తక్కువగా ఉండేవాడు. కాని హాస్టెలులో ఇద్దరమూ ఒకే గదిలో ఉండేవాళ్ళము. వాడంటే నాకు ఒళ్ళుమండేది. అంటే వాడేమీ చెడ్డవాడుకాదు సుమండీ! పాపము చాలా మంచివాడు. అయితేనేమి? వాడు ఎదుట పడ్డాడంటే మట్టుకు ఎక్కడ లేనికోపమూ వచ్చేది. నా కొక్క డికే కాదు సుమండీ ఇలా ఉండడం. వాడి ఖర్మము ఏమిటో కాని వాడిని ఎరిగి ఉన్నంతవరకూ అందరకూ అలాగే ఉండేది. ఎటొచ్చీ తక్కిన వాళ్ళంతా తమ భావాలను వాడి ఎదుటనే ప్రకటించేవారు. నేనుమట్టుకు, లోపల ఎంత

కోపంగా వున్నా, కొంత జాలికూడా ఉండడముచేత పైకి ఏమీ అనేవాడిని కాడు. అందుచేత వాడి ప్రాణానికి నేను దేవుడిలా కనబడేవాడిని. వాడి కష్టసుఖాలన్నీ నా దగర మొరపెట్టుకునే వాడు. ఊరుకున్న కొద్దీ ముఖముమీద ముఖముపెట్టి ఏదో సొద వెళ్ళబోస్తూనే ఉండేవాడు. ఇరవైనాలుగు గంటలూ ఒళ్ళంతా చెమటలు కారుతూ, పెద్ద అయాసపడుతూ నా ముఖానికి అరంగుళము దూరములో తన ముఖముపెట్టి చండీశ్వరుడు చెవులో చెప్పినట్లు వాళ్ళపిల్లి ప్రథమ రజ స్వలా అయినదనో, పొరుగింటి కుక్కకు తొలిచూలనో, వాడి మేనత్త మనుమరాలికి మామూలువలె కవలలు కాక ఈసారి ముగ్గురు పుట్టారనో మా పక్కయింటి ఆవిడ గర్భస్థ శిశువుకు కూడా వినపడేటట్టు హోరెత్తితే ఎలాగ చెప్పండి సహిం చడం. ఈ బాధపడలేక వాడిని ఏడిపిద్దామనే చేశాను. కాని ఇంత ఇలా అవుతుందని అప్పుడు నేనూ అనుకోలేదు నుమండీ! తీరా తరువాత వాడి అవస్థచూస్తే నాకూ జాలి వేసింది. ఇంక నెప్పుడూ అలా గట్టిగా మాట్లాడననీ, అనవ సర ప్రసంగము చెయ్యననీ అనేక ఒట్లూ ప్రమాణాలూ అయి నాయి. ఏమి లాభం!

మా సుబ్బుడు Petrol Tank లా ఉండేవాడని మనవి చేశాను కానూ. వాడినిచూచి ప్రతివాళ్లూ నవ్వడం, కాస్త పరి చయమున్న వాళ్ళంతా ఏడిపించడం, వాడికి పరిపాటి అయి పోయింది. అందుచేత వాడు పాపం నలుగురిలో కెప్పుడూ వెళ్లేవాడుకాదు. కాని, ఈ మధ్య మనవూళ్లో కాంగ్రెసు జరిగి నప్పుడు, వాడికి చూద్దామని బుద్ధిపుట్టి 'వెళ్లనా మాననా' అని నన్ను సలహా అడిగాడు. తప్పకుండా వెళ్లు. కాస్త నలు గురిలోనూ తిరక్కపోతే నీకి పిరికితనం ఎప్పటికిపోను.' అని

నేను కొంచెము మందలించాను. దానితో పాపము వాడు ధైర్యము తెచ్చుకొని ఒక టిక్కట్టు కొనుక్కొని కాంగ్రెసుకు హాజరయ్యాడు. ఏవేళప్పుడు ఇంటిదగ్గర బయలుదేరినాడో కాని ఇంక నక్కడినుంచి వాడిపాట్లు ప్రారంభమయ్యాయి బాబూ! ఏమి చెప్పను. బండి దిగేసరికి చుట్టూ చూస్తుండ గానే వెయ్యిమంది చేరారు. ఇంతమందీ వాడు ఎక్కడికి వెళ్ళితే అక్కడికికూడా రాంభజనచేస్తూ వెళ్లడం, దానితోటి దూరాన్ని ఉన్నవాళ్లంతా గుంపునుచూచి నాయకులలో పెద్ద వాళ్లు ఎవరో వెడుతున్నారని వాళ్లు కొంతమంది పరుగెత్తుక రావడము, ఇలా అంతకంతకు జనసమూహము ఎక్కువ అయ్యేసరికి పోలీసువారూ వాలంటీర్లూ కలుగచేసికొని జనాన్ని తప్పించేసి వాడిని బండిమీద ఎక్కించి ఇంటికిపంపించారు. ఇంతటితోటి అయిందా. ఇంకోరోజున ఏమి జరిగిందను కున్నారు. వాడు వచ్చేసరికి కొందరు ఆడ వాలంటీర్లు వంతు మారి బసలోకి వెళుతున్నారు. వాడి ఖర్మం చాలక వాళ్ళ కంటబడ్డాడు. ఇంకనేముంది. కొంపమునిగింది. వాళ్ళంతా గబగబా వాడిదగ్గర కొచ్చారు. ఒక్కసారి ఎగాదిగా చూశారు. పదిమంది ఒకవైపునా, పదిమంది ఒకవైపునా బారులుతీర్చి నిలబడ్డారు ముందు కొక యిద్దరువచ్చారు. వాడిదంతాచూచి తెల్లబోయి ఒక్కక్షణం అట్టే నిలబడిపోయాడు. ఏమీతోచక ఏమి జరుగుతుందో చూద్దామని రెండడుగులు ముందుకి వేశాడు. వాళ్ళంతా కూడా అలాగే నడిచారు. పక్కలనున్న వాళ్ళు జనాన్ని ఆపుతున్నట్లు చేతులూ, చేతులూ కలిపారు. ముందున్నవాళ్లు 'తప్పుకోండి' 'పిల్లలను తియ్యండి.' 'ప్రమాదం' అని జనాన్ని హెచ్చరించడము మొదలెట్టారు. అదివర కక్కడ జనము లేకపోయినా ఈ కేకలూ హడావిడీ

చూచి ఏమిట్లో అనుకొని ఎక్కడలేనివాళ్లూ పరుగెత్తుకొచ్చారు.

ఇదంతా చూచి మనవాడు అంతమనిషి నిలువునా నీరై పోయి అవయములు స్వాధీనంతప్పి పేడకడిలాగ అక్కడ చతికలపడ్డాడు. దానితో అక్కడఉన్న జనం అంతా ఒక్క సారి గొల్లుమన్నారు. ఇంక నక్కడఉంటే మర్యాదాగా ఉండ దని యీ ఆడవాళ్ళంతా నిమ్మళంగా పప్పుజారినట్టు జారారు. ఈ గుంపుని చూచి కొంతమంది వాలంటీర్లూ పోలీసులూచూచి వీణ్ణి యధాప్రకారం బండిలో యెక్కించి యింటికి దొమ్మని యీమాటు కాంగ్రెసుకు వస్తేమాత్రం మాట దక్కదని గట్టిగా మందలించారు. బాబూ! మీరు చెప్పాలా! నాకే బుద్ధివచ్చిం దని యింటికిజేరి ఆ బెంగతోపాటు మంచంపట్టాడు. మంచం మీద ఉండగానే ఒకరోజున నాకు కబురు పంపించాడు. నేను వెళ్ళి వాడుపడే అవస్థ చూసేసరికి చాలా జాలివేసింది. " ఈ స్వల్పవిషయానికి బెంగయేమిటి? ఈ మంచం పట్టడం యేమిటి? లే! యీపాటికి చాలు. ఇల్లా అయితే యేలా బ్రతుకుతావు? కాస్త యెవ్వళ్ళయినా నిన్నుచూసి నవ్విన ప్పుడల్లా యింత హంగామా చేస్తావా? నువ్వుకూడా లైటుగా తీసి కొని కాస్త నవ్వేస్తే తీరిపొయ్యేదానికి ప్రాణంమీదికి తెచ్చిపెట్టు కున్నావేమిటి?" అని గట్టిగా చీవాట్లువేశాను. దాంతోటి వా డెక్కెక్కి రాగాలు పెడుతూ ఒరే బ్రదర్! ఇందుకుట్రా ని క్కబు రంపించింది? నే నెల్లాగూ యింక బ్రతుకను బ్రతికి నందువల్ల ప్రయోజనం యేముంది గనుక. ఉన్నన్నాళ్ళూ యిల్లా ఉక్కిరి బిక్కిరి అవుతూండవలసిందే గదా! అని చావడానికి నిశ్చయం జేసుకొని ఒకటి రెండు విషయాలు నీకొప్పజెప్పి వెడదామని నీకు కబురంపిస్తే యీ అవసాన కాలంలో నువ్వుకూడా నన్ను యేడిపించాలా" అన్నాడు. వాడి

మాటలు విని నిజంగా నాకూ దుఃఖంవచ్చింది. వాడివల్ల యే లోటులేకపోయినా కొ _స్త అంద వికారంగా ఉన్నంత మాత్రాన్ని యింత అవస్థ బెడుతున్నారే ప్రజలు! ఏమి చిత్రంగా ఉంది ప్రపంచ ధర్మం! అని మనస్సులో అనుకొని "ఏడిశావులే! సంతోషించాను. ఈ వేషాలన్నీ కట్టిబెట్టు యీపాటికి, లేకపోతే మీఅమ్మతోటి చెపుతాను. నీ దారిని నువ్వు చక్కాబోతే పాపం పెద్దది అవిడగతేం కాను ఏమందో మాకో యేడవాలి. లేదా యే ఉపాయము చేతనైనా యీ వికారం తగ్గించుకునే యేర్పాటు జేసుకోవాలి కాని మాట్లాడితే చస్తానంటావు ఏమిటి? చావంటే అంత సులువుగా ఉందనుకున్నావా! ఏదీ! చావు, చూద్దాము" అన్నాను. వాడు మహా బిరికిలెండి. చావంటే మహా చెడ్డభయం - అనేసరికి మనిషి కొంచెం చల్లబడి "మరేమిరా నాయనా! మరేలాగు నాగతి, అ మందో మాకో నువ్వేచూడాలి? నువ్వుతప్ప నాకీ సహాయ్యం చేసేవాళ్ళు మరొకళ్ళెవ్వరూ లేరు. అన్నట్లు మీ నాన్నరాసిన గోసాయీ చట్కాల పుస్తకం ఒకటి వుండాలిగదా! అందులో యేమైనా ఉందేమో కొ _స్త చూచిపెడుదూ! నీ కాళ్లు పట్టుకుంటాను. ఒరే! చచ్చి నీ కడుపున పుడతారా!" అని ప్రాధేయపడ్డం మొదలుపెట్టాడు. "ఏది ఎల్లాఉన్నా నువ్వు నా కడుపున పుట్టడానికి మాత్రం చచ్చినా ఒప్పుకోను. నీ కటువంటి ఉద్దేశం ఉంటే నీ కేవిధమైన సహాయం చేయడానికి వీలులేదు. తరువాత నీ యిష్టం" అన్నాను. "బాబు బాబు! అదికాదోయి మాటవరుసకి అన్నాను. నన్నిల్లా యేడిపించి చంపకు. ఈ ఒళ్ళు చులకబడటానికి యేమైనా ఉన్నదేమో! ఆ పుస్తకం చూద్దూ లేకపోతే - నన్ను చంపుకతిన్నట్టే అన్నాడు. 'సరే! అల్లాగే చూసి యేసంగతీ

సాయంత్రం చెప్తాను. ముందులేచిభోజనం చెయ్యి' మని చెప్పి యింటికి వచ్చాను.

మానాన్న కొంచెం వైద్యం చేసేవాడులెండి. దానికితోడు కనబడ్డ బైరాగి ముండాకొడుకునల్లా లాక్కొచ్చి దిట్టంగామేపి వాడిదగ్గర యేదోమందు అడిగి తెలుసుకొని పుస్తకంలో రాస్తూం డేవాడు. అది ఎవరికైనా యెప్పుడైనా ఉపయోగించాడో లేదో నాకు తెలియదు. ఆయన చనిపోయేటప్పుడుమట్టుకు నాకు 'యీ పుస్తకం బహుభద్రం. ఎవ్వరికీ యివ్వవద్దు. ఎన్ని సంవత్సరములు కృషిచేసినా యిటువంటిది సంపాదించడం బహుకష్టం. నీకు యిష్టంలేకపోతే నీ కొడుకులో మనుమలో యెవళ్ళో ఒకళ్ళు ఉపయోగిస్తారు. జాగ్రత్తసుమా' అని పది సార్లు చెప్పి వప్పజెప్పాడు. ఆ పుస్తకం నాటికి నేడు బయ టికి తీసిదులిపి పేజీలు తిరగవేయగా'లఘ్వీకరణయోగము' అని ఒకచోట కనపడ్డది. సరేయిదేం చేస్తుందో చూద్దామని యీయోగం సుబ్బుడికిచ్చాను. వాడు యేవిధమైన సంకోచం లేకుండా ముందూ వెనుకా ఆలోచించకుండా చికిత్స ప్రారం భించాడు.

ఒకవారం రోజులవరకూ యేమి జరిగిందీ మందేలా పని జేసిందీ నాకేమీ వర్తమానం తెలియలేదు. నాకేదో తొందర పనుండి ఊళ్లోకూడా లేను. ఎనిమిదో నాడు నేనూరినుంచి వచ్చేసరికి నుంచున్న పళంగా రమ్మని అదివరకు రెండు రోజులనుంచీ రోజూ నాలుగైదు కబుర్లు వస్తున్నాయని మావాళ్ళు చెప్పారు. ఏమి కొంపమునిగిందో అని తిన్నగా వాళ్ళింటికి పరుగెట్టాను. వెళ్ళేసరికి వాళ్ళమ్మ గుమ్మం లోనే కనబడి పెద్దపెట్టున రాగాలుపెట్టడం మొదలు పెట్టింది. "ఏమమ్మా ఏమిటి? అసలు సంగతేమిటి చెప్పు!

మనవాడు కులాసగానే ఉన్నాడుకదా ?'' అన్నాను. 'ఏమో నాయనా ! ఏమీ తెలియడంలేదు. మూడురోజులనుంచి మా వాడు గదిలోనుంచి యివతలకు రావడంలేదు. గదిలో యెప్పుడూ మూలుగులూ యేడుపులూ వినపడుతుంటాయి. భోజనం వేళప్పుడు మట్టుకు యెల్లాగో తలుపుతెరచి ఉంటుంది. మొదటిరోజున తలుపుతియ్యకముందే అన్నం ఉయ్యాలబల్ల మీదపెట్టిపొమ్మని ఒక కేకవినపడ్డది. తలుపుతీసికొని లోపలికి వెళితే మనిషి యెక్కడా కనపడడు. ఏమిచేతును నాయనా? నాకేందారి ? ఏనుయ్యో గొయ్యో చూచుకో వలసిందేనా? మా వాడింక కళ్ళకి కనపడ్డా?' అని మళ్ళీ యేడుపు మొదలెట్టింది. 'అమ్మా ! తొందరపడకండి. ఈ సంగతేదో చూద్దాము. మీ రల్లా విచారపడకండి. మీ రిక్కడే వుండండి.' అనిచెప్పి లోపలికి వెళ్లి వాడి గదితలుపు కొట్టాను. ఎవరువారు, అనిలోపల్నించి వినపడ్డది. 'నే'నన్నాను. 'బాబూ వచ్చావా ? రక్షించావు తండ్రీ !' అని తలుపు తీశాడు. లోపలికి వెళ్ళాను. లోపలమనిషి మట్టుకుకనబడలేదు. 'ముందు తలుపు వెయ్యి. నేను పైనున్నాను.' అన్నాడు. అనేసరికి తలుపు వేసి పైకి చూశాను. మిద్దెనంటి పెట్టుక్కొని గబ్బిలంలాగ వేళ్ళాడుతూ సుబ్బడు కనపడ్డాడు. కడుపు చెక్కలయ్యేటట్టు నవ్వొచ్చింది. "అల్లానవ్వుతా వేమిరా ? నాగతేమిటి' అని విచారించడం మొదలుపెట్టాడు. వాడు యేడ్చినకొద్దీ నవ్వొచ్చిందినాకు. ఎంతసేపటికీనవ్వు ఆపుకోలేక పోయాను. వాడు నిమ్మళంగా ఉయ్యాలగొలుసుపట్టుకొని నెమ్మదిగా క్రిందికి పాకివచ్చాడు. ఈ చిత్రంచూచి కొంచెం నవ్వు ఆపుకొని నేను ఉయ్యాలబల్ల మీద కూర్చుని వాణ్ణిగట్టిగా పట్టుకొని, ఏమిట్రాయిదీ? అసలు సంగతేమిటి? అన్నాను. 'ఏమీలేదు. నీ

మందింతపని జేసింది, నా కొంప ముంచింది బుద్ధి గడ్డితిని నిన్నడిగినందుకు మా బాగాచేశావు '' అన్నాడు. “అవును - ఏమి జరిగిందేమిటి? అసలు సంగతి మొదట్నుంచీ చెప్పవేం ” అన్నాను. 'ఏముందీ నీ మందు పుచ్చుకోవడం ప్రారంభించాను. 3 రోజులవరకూ మామూలుగానే ఉన్నది. 4 వ రోజున బాగా చులాగ్గా ఉన్నట్టునడుస్తూంటే అడుగులు తేలిపోతూన్నట్టు ఉంది, 5 వ రోజున బొత్తిగా క్రింద నడవలేక పోయినాను. మంచంమీద పడుకున్నానే, మందు పుచ్చుకోనా వద్దా అని సందేహిస్తూ. 6 వ రోజునకూడా ఒక మోతాదు పుచ్చుకున్నాను. ఆ మధ్యాహ్నానికి మంచం మీద పడుకున్న మనిషిని అమాంతంగా గాలిపడగలా యెగిరి పోయి యీ మిద్దెకువచ్చి కొట్టుకున్నాను. ఇదిగో ముఖంమీద యెంత బొప్పికట్టిందో చూడు. అక్కడనుంచి నెమ్మదిగా కొంచెం అవసరం వచ్చినప్పుడు యీ ఉయ్యాల గొలుసు ధర్మమా అని క్రిందికి ప్రాకులాడ గలుగుతున్నాను. రెండు పూటలు అల్లాగనే క్రిందికివచ్చి భోజనంచేశాను. ఈ సంగతి యింకా మా అమ్మకి తెలియదు. ఆవిడకీ సంగతితెలిస్తే గుండె బ్రద్దలై చస్తుందిగాని యింక నేమైనఉందా? నాగతేమిటింక? బ్రతికి ఉన్నన్నినాళ్లూ యిలా పక్షిలాగ యెగురుతూ ఉండవలసిందేనా? లేకపోతే—గత్యంతరం యేమైనా ఉందా?'' అన్నాడు. నాకూ యేమీ తోచలేదు. చాలాసేపు ఆలోచించాను. మా నాన్న పుస్తకంలో కొంత యధార్థం ఉందిగదా అనుకున్నాను. ''సరే తరువాత సంగతి యెల్లా ఉన్నా నీకు రెండు సూట్లు కుట్టించి లైనింగు మధ్యను సీసపు బిళ్ళలు పెట్టిస్తాను. ఆ బరువుకి పైకి యెగిరిపోకుండా ఉంటావు. వీధిలోకి వస్తూ పోతూ ఉండవచ్చును. ఈలోపున

యింకో ఉపాయం ఆలోచిద్దాము." అని యింటికివచ్చి ఆ సాయంత్రానికే 2 సూట్లు తయారుచేయించుకొని వెళ్ళి యిచ్చాను. వాడు బ్రహ్మానందభరితుడై ఒకటి తొడుగుకొని చూచాడు. మేము అనుకున్నట్లుగానే ఆ బలువుకి అంతరిక్షానికి యెగిరిపోకుండానే నేలమీదనే నిలువగలిగినాడు. నన్నొక్కసారి కౌగలించుకొని, "బాబూ! దీనికేమైనా విరుగుడుందేమో మళ్ళీ ఒక్కసారి మీ పుస్తకం చూసి నన్ను మామూలు మనిషిని చేస్తేనేగాని వల్లగాదు. లేకపోతే— ఏ వేళప్పుడు యేం ప్రమాదిస్తుందో సుమా" అన్నాడు.

"సరే" అని నా దారిని నేను యింటికి చక్కా వచ్చాను. 4 రోజులవరకూ మళ్ళీ వాడి కబురు నాకూ - నా కబురు వాడికీ తెలియలేదు. ఈ లోపున పు స్త కం తిరిగేశాను. అందులో ఒకచోట "గుర్వీకరణయోగం" అనిన్నీ మరొక చోట "కార్శ్యయోగ" మనిన్నీ వ్రాసి ఉన్నాయి. సరే? ఇవి రెండూ మనవాడికి ఉపయోగిస్తాయిగదా అని ఒక కాగితం మీద వ్రాసుకొని బయలుదేరి ముందు క్లబ్బుకి వెళ్ళి అక్కడనుంచి వాడి యింటికి వెడదాముకదా అని బయలుదేరాను. క్లబ్బులోకి వెళ్ళేసరికి బిలియర్డు రూములో పెద్ద కల్లోలము వినబడ్డది. ఏమిటా అని చెప్పితిన్నగా లోపలికి వెళ్ళాను. క్లబ్బులో నగంమంది మెంబర్లు ఆ గదిలో ఉన్నారు. బిలియర్డుటేబులు మీద సూటు లేకుండా షర్టు, చెడ్డీతోటి ఉన్న సుబ్బణ్ణి నలుగు రదిమిపట్టుకున్నారు. ఇంకొక్కడు వాడి కాలికి కొంచెము లావుపాటి ట్వైనుదారం కడుతున్నాడు. సుబ్బడు "నన్ను విడిచిపెట్టండి బాబో" అని గొల్లున గోలపెడుతున్నాడు. ఇదంతా చూచి జనాన్ని వత్తిగించుకొని టేబుళు దగ్గరకువెళ్లి కళ్ళొత్తిజేసి "యేమిటి

అన్యాయం" అని ఒక్క ఊరుం 'ఊరిమాను. అది విని కొంచెం జనం వెనక్కి తగ్గారు. నన్ను చూచేసరికి సుబ్బడికీ కొంచెం ధైర్యం వచ్చింది. "రక్షించరా, బాబూ! వీళ్ళంతా నన్నెలా ఏడిపిస్తున్నారో చూశావా? ఈ యములాళ్ళ చేతుల్లోంచి రక్షిస్తే యిక జన్మ మధ్యముందెప్పుడూ క్లబ్బుకురాను. ఇవాళతోటి బుద్ధొచ్చింది. వీళ్ళంతా చదువుకున్నవాళ్ళు, పెద్ద మనుష్యులు అనుకున్నాను. నన్నుచూచి జాలిపడిపోయి నన్నిలా ఏడిపించుకు తింటున్నారు" అన్నాడు. నేను కూడా వాళ్ళందర్నీ తలవాచేటట్టు చీవాట్లేసి, వాళ్ళ చేతుల్లోంచి సుబ్బణ్ణి విడిపించి వాడి సూటు తొడిగి, నిమ్మళంగా యింటికి తీసికెళ్ళి, ఈ అల్లరంతా ఎందు కొచ్చిందని అడిగాను. బాబూ ఇదంతా నా ఖర్మం. ఈ అల్లరంతా నా మూలానే వచ్చినది. నోరుమూసుకొని యింటిదగ్గర కూర్చోలేక, చాల రోజులయింది క్లబ్బుకువెళ్ళి ఒక్కసారి పేపరు చూచివద్దామని బుద్ధి గడ్డితిని క్లబ్బుకు వెళ్లాను. వెళ్లినవాడిని పేపరు చూచుకొని పెందలాడే యింటికి రావచ్చునా? లేదు. బిలియర్డ్సు రూంలోకి వెళ్లి కూర్చున్నాను. వెంకట్రావువచ్చి "ఏమోయి ఎక్కడ కనబడడం మానివేశావు. క్లబ్బుమీద యింత దయ తప్పినదే"మని వీపుతట్టాడు. వాడిచేతికి గట్టిగా ఈ సీసపు బిళ్ళలు తగిలినాయి. ఇకనేముంది కొంప మునిగింది. ఇజారుకూడా తడిమిచూశాడు "మనవాడు సూటులో మోహరీలు దాచుకున్నాడోయ్" అని కేకేశాడు. అనేసరికి నలుగురువచ్చి కోటూ యిజారు లాగేశారు. నేనువద్దు మొర్రోఅని ఎన్నివిధాల మొత్తుకున్నా ఒక్కడూ విన్లేదు. కోటూ, యిజారు లాగెయ్యగానే యథాప్రకారం పైకెగిరి పోయాను. దెబ్బతగలకుండా ఒకదూలాన్ని పట్టుకొని అపుకున్నాను. ఇదేవిటంటే

యిదేవిటని అంతా ఓ క్షణం ఆశ్చర్యపోయి, నన్ను నిమ్మళంగా బిలియర్డ్ టేబిల్ దగ్గరికి లాగావు. ఇంతలోనే 'యింకొహ రొచ్చి కాలికి దారంగట్టి గాలిపడగలా ఎగరేస్తే ఎంతపైకి వెడతాడో చూద్దాం' అన్నాడు. బాగుందంటే బాగుందని ట్వైన్ వుండోటి తెప్పించి నాకాలికి కడుతూండగా నువ్వొచ్చి రక్షించావు. యింకొక రెండు నిమిషాలు నువ్వు రావడం ఆలస్యమైతే వాళ్లు నన్ను రోడ్డుమీదికి తీసికెళ్లి ఎగరేసేవారు! ఏ కాకులో గద్దలో ఈపాటికి నన్ను పొడిచిచంపేశేవి. నీ ధర్మమా! అని మాయిల్లు, మా అమ్మని మళ్లీ చూడగలిగాను" అనీ నా రెండుచేతులూ పట్టుకొని చంటిపిల్లాడికి మల్లే వెక్కి వెక్కి రాగాలెట్టడం మొదలెట్టాడు. నే వాణ్ణి చాలా సేపు ఓదార్చి ఆ క్లబ్బు మెంబర్ల దౌర్జన్యమును చడా మడా తిట్టి యింక యిటువంటి చిక్కుండదనిన్నీ, దానికి తగిన మందు దొరికిందని నేను రాసుకొచ్చిన కాగితం వాడికిచ్చాను. అది చూచుకుని వాడికి పట్టరాని సంతోషం దుఃఖంకూడా వచ్చినవి. "బాబూ నువ్వుచేసినమేలు జన్మ జన్మాలకీ మరవను." అని ఇంకా యేమిటో చెప్పబోతూవుంటే నాకు పనుందని చెప్పి యింటికి చక్కావచ్చాను.

తరువాత ఓ వారంరోజులు గుర్వీకరణ చికిత్స పదిహేను రోజులు కార్శ్యచికిత్స, చేసేసరికి మనిషి అలా సళాకులా తయారయాడు. ఆ లావు తగ్గడంతోనే మనిషంతా మారిపోయాడు. ఆ లావుతోపాటు మునుపటి ధోరణికూడా తగ్గిపోయింది. మునుపు ప్రతివాళ్ళూ ఎంత అసహ్యించుకొనేవాళ్ళో ఇప్పు డంతగా వాడి స్నేహాన్ని అపేక్షిస్తున్నారు, నాకు వాణ్ణి చూసినప్పుడల్లా [illegible]ర్యంగా వుంటుంది. అప్పట్నుంచి మా[illegible]రాసిన పుస్తకంమీద ఎక్క[illegible]లేని గురి కుది

రింది. బహుశ్రద్ధతో చదవడం మొదలుపెట్టాను. చాలా విచిత్రమైన సంగతులున్నాయి సుమండి. మీరేదో పనిమీద వెడుతున్నట్టున్నారు. క్షమించండి. యింతసేపు మిమ్మల్ని బోర్ చేసినందుకు.—

మనం సాధారణంగా లేదనుకుంటాము కాని, జన్మ కాల ఫలం, తత్కాల నక్షత్రఫలం చాలా ఉంటుంది. సావకాశంగా మన జీవితాలూ, మన బంధువుల జీవితాలూ, మన స్నేహితుల జీవితాలూ, సవిమర్శంగా సింహావలోకనం చేసి చూస్తే నే చెప్పినదాని యాథార్థ్యం తేలకపోదు.

ఒకొక్కక్కడు పుట్టిన వేళావిశేషాన్నిపట్టి, వాడిజీవితమంతా నిండు గోదావరిలాగ, చక్కగా ఒడుదుడుకులు లేకుండా హాయిగా వెళ్ళిపోతుంది. మరొకడి జీవితం కొండవాగులాగ అన్ని ఒడుదుడుకులూ పడుతుంది. ఒకడి జన్మ నక్షత్రాన్ని పట్టి, పుట్టినది మొదలు ఆఖరువరకు, "ఎంత మంచివాడు, ఎంత యోగ్యుడు, ఏమి నెమ్మది, ఏమి సౌమ్యత" అని అనిపించుకుని పోతాడు. వాడు ఇతరులకు దమ్మిడి ఎత్తు ఉపకారం చెయ్యకపోయినా, ఈ పేరుమట్టుకు వస్తుంది. ఇంకొకడి జన్మ నక్షత్రఫలం ఎటువంటిదంటే పుట్టినరోజు లగాయతు, ప్రతి నిత్యం, త్రికాలములయందూ, ఎంత మంచిగా ఉన్నా ఎవరిచేతనో ఒకరిచేత, ఎందుకో ఒకందుకు చీవాట్లు తింటూ ఉండడమే పని.

ఈ రెండో జాతిలో వాడు కూర్మయ్య. అతని పుట్టుకకు అతని తల్లి చాలా శ్రమపడ్డదట. ఆ తరువాత చాలా జబ్బుపడి చచ్చినంత పని జరిగి ఇంకో ఏడాదికి పూర్తిగా చచ్చిపోయిందట. అందుకని, ఆవిడ జబ్బుకీ, చావుకీ ఇతనేదో బాధ్యుడైనట్లు తండ్రీ, అన్నగారూ, అప్పగారూ, మేనమామలూ ఇతన్ని ఎప్పుడూ దరిద్రుడనీ, నిర్భాగ్యుడనీ, తిట్టిపోస్తూ ఉండేవాళ్లు. ఆ తరువాత ఇతని ఖర్మంకాలి తండ్రి

చచ్చిపోయాడు. ప్రపంచంలో ఎవరి తండ్రులు మట్టుకు చావకుండా బ్రతికి ఉన్నారు. ఈ తండ్రి చావువల్ల బాధ ఈ కుర్రకుంకకు ఏమీ లేనట్టూ, తక్కినవాళ్లే బాధ పడు తున్నట్లూ, ఏదో వంకపెట్టి, అన్నగారూ, అప్పగారూ, మేనత్తా, ధూళెత్తిపోస్తూ ఉండేవాళ్లు. చదువులో పద్ధతరవాత చెప్పనే అక్కరలేదు. ఇంట్లో ఏ పుస్తకమో పుచ్చుకు కూర్చుంటే "అస్తమానం గుడి పాములాగ ఇంట్లో ఏడవకపోతే కాశ్మేపు వీధులోకెళ్లి ఆడుకో కూడదూ?" అని ఒకటి తగలనిచ్చేది అప్పగారు. ఒక రోజున ఖర్మంచాలక ఆడుకుని ఇంటికి ఆల స్యంగా వస్తే, 'వెధవ ఆటలూ నువ్వూను. ఈ శ్రద్ధ చదువు మీద ఉండకూడదూ. ఊరంతా కాకిలాగా ఎందు కిలా బలా దూరు తిరగడం?' అని అన్నగారు రెండు తగలనిచ్చేవాడు. తిట్ట తలుచుకుంటే కారణమేమిటి.

ఇలాగే, ఎలాగో చదువు పూర్తి అయింది. పెళ్లి అయింది. ఉద్యోగ మయింది. భార్య కాపురానికి వచ్చింది. ఇంక హాయిగా సుఖపడతా డనుకుంటారా మీరు, చెప్పడం మరిచి పోయాను. ఒక కూతురుకూడా పుట్టింది. ఏ లోటూ లేదు కదా! కూర్మయ్య చాలా యోగ్యుడూ, పెద్ద మనిషీ, స్నేహ పాత్రుడూ, ఆపదకు అడ్డుపడేవాడూ అని ఊళ్లో కావలసి నంత పలుకుబడి. కాని ఇంట్లో లేని పలుకుబడి ఊళ్లో ఎంత ఉంటేమట్టుకు ఏమి లాభం! ఇంటికి వచ్చేసరికి, ఆయన భార్య ఎందుకో ఒకందుకు కారాలూ మిరియాలూ నూరుతూ ఉండేది. ఎందుకంటే ఏమి చెప్పం—కూర్మయ్య అదృష్టం. ఆవిడా చాలా మంచి మనిషే. మరో వేషాలేమి లేవు. భర్త మీద ప్రేమా గౌరవం లేకపోలేదు. కాని ఆయన మొహం చూస్తేమట్టుకు మొద్దులెట్ట బుద్ధి అయేది. అవునా,

పోనీ ఆ కుర్రముండేనా.......! రామ రామ! అది మరీని తల్లి కంటె రెండాకులు ఎక్కువ చదివింది.

వాళ్లిద్దరూ పోగడి ఎందుకో ఒకందుకు అహర్నిశాదులు ఆ కూర్మయ్యా ముండావాడిని సాధించి పొయ్యాని క్షణం లేదంటే నమ్మండి. మాటవరుసకు ఒక్క సంగతి చెపుతాను. దానితో మీకే తెలుస్తుంది.

కొంతకాలం కాపురం చేసిన తరువాత సూరమ్మగారికి, అనగా కూర్మయ్యా భార్యకు దేశాటనం చేసి నాలుగువూళ్లూ చూడవలెనని బుద్ధి పుట్టింది. ఊహ పుట్టడం తడవుగా నన్న నన్నగా మొగుడుదగ్గర నసాయి నొక్కలు ప్రారంభించింది. 'ఆ దరిద్రపువూళ్లో పుట్టాను. ఈ దిక్కుమాలిన ఊళ్లో వచ్చి పడ్డాను. నా రోజులు ఇక్కడ అఖరు కావలిసిందే' అని ఓమాటు. 'దేనికేనా పెట్టి పుట్టాలి. నా రాత ఇంతే, నా కళ్ల ముందు పుట్టిన వాళ్లంతా, దమ్మిడీకి కొరగాని వాళ్ళంతా ఇట్టే, చెన్నపట్నం అని ఇట్టే బెంగుళూరని క్షణంలో ఎన్నెన్ని వూళ్లో తిరిగి చక్కా వస్తున్నారు. నా మొహానికి ఏ పల్లకాడూ లేదుకదా' అని ఓమాటు కళ్లు అద్దుకుని, ఓమాటు ముక్కు తుడుచుకుని, మూతి ముడుచుకుని కూచునేది. తల్లి ఊరుకునేసరికి కూతు రందుకునేది. అవి దేమాఒంటే ఇదికూడ ఆవిడమాట అని తీరవలసిందే. వట్టి His Master's Voice లాంటిది.

కొన్నాళ్లు విని విని, 'అలాగే వెళదాం నడువు. నీ ఇష్టమే' అన్నాడు కూర్మయ్యా ఒకనాడు. "ఆ. అంత అదృష్టమా అందిట వెనకటికి, మీ కెప్పుడైతే కట్టిపెట్టారో మా వాళ్లు అనాడే తీరాయి అన్ని ముచ్చట్లూను" అని కళ్లునీళ్లు కుక్కుకుని కూర్చుంది. ఇలా ఉండగా రైలువాళ్ళకి హఠాత్తుగా

ఏమి పుట్టిందో కాని పది రూపాయల టిక్కట్లు పెట్టారు. దానితో ఈవిడకు ఉద్రేకం ఎక్కువయింది. కొన్నాళ్లు కూర్మయ్యకు కడుపునిండా తిండికాని కంటినిండా నిద్రకాని కరువైపోయింది. ఈ బాధ పడలేక, రైలువాళ్లు ప్రత్యేకం తన్నేడిపించడానికె ఈ టిక్కట్టు పెట్టారనుకుని, ఒక నెల రోజులు కచ్చేరికి సెలవుపెట్టి మంచిరోజు చూచుకొని బయలుదేరారు.

ముందు విశాఖపట్నం వెళ్లి, సింహచలం సేవించుకుని, దక్షిణానికి తిరిగి రాజమండ్రీ, బెజవాడ వగైరా చూచి చెన్నపట్నం చేరారు. దారి పొడుగునా సూరమ్మగారి చర్యలు వర్ణిస్తే ఒక పెద్ద గ్రంథం అవుతుంది. అందుచేత ఊరికే టూకీగా ముఖ్యాంశం ఒక్కటే చెపుతున్నాను.

చెన్నపట్నంచేరి వారం రోజులుపాటు వొళ్లు హూనం అయ్యేటట్లు కార్లలోనూ బస్సులలోనూ తిరిగి, చూడవలసిన వన్నీ చూశారు. రెండు రోజులు విశ్రాంతి తీసుకుని, రెండు సినిమాలు చూసి మకాం ఎత్తుదామనుకున్నారు. ఆ రోజున ఆడవాళ్లను ఇంటిదగ్గర వుంచి బజారులో ఏవో నాలుగు వస్తువులూ కొనుక్కొస్తానని ఒంటరిగా బయటపడ్డాడు, కూర్మయ్య బ్రతుకుజీవుడా అని. తిన్నగా టవునుకు వచ్చి, నాలుగూ కొనుక్కొని, నెమ్మదిగా హైకోర్టు బీచికి చేరాడు, సాయంత్రానికి. కొంచెముసేపు నీటిదగ్గర కూర్చుని, నెమ్మదిగా హార్బరు కేసి నడిచాడు

హార్బరు గోడమీద సావకాశంగా నడుస్తూ మహాసముద్రం, దాన్ని జయించడానికి మానవులు చేస్తున్న ప్రయత్నాలను గురించి ఆలోచిస్తూ కొంతసేపు నిలబడిపోయాడు. ఊరికే షికారుకు వచ్చినవాళ్లు కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ పోతున్నారు. ఎక్కువ మంది ఆంగ్లేయులు కనపడ్డారు.

వారిలో ముఖ్యంగా ఒక యువతి, మూడు నాలుగేళ్ళ పిల్లను చెయ్యి పట్టుకొని నడిపించి తీసుకొస్తోంది. వెనకాల ఆయా, పిల్ల ఆటసామానులు తీసుకొని వస్తోంది. తన ఊహా ప్రపంచంలో తేలిపోతున్న కూర్మయ్యకు వారంతా ఏదో స్వప్నంలో మనుష్యులులాగ లీలగా కనుపించారు. ఆలోచనలు ఆకాశంలో ఉన్నా దృష్టిమట్టుకు ఎందుచేతనో ఆ చిన్నపిల్ల మీదనే నిలిచిపోయింది కూర్మయ్యకు. పిల్ల, తల్లి చెయ్యి పట్టుకుని గంతులేస్తూ, కేరింతాలు కొడుతూ, ఏవో అర్థంలేని ప్రశ్నలు అడుగుతుంటే ఎంతో ముద్దుగా ఉంది కూర్మయ్యకు. అలా నడుస్తూ నడుస్తూనే పిల్ల తల్లిచెయ్యి విడిపించుకుని చప్పట్లు కొడుతూ ముందుకి పరుగెత్తింది, ఆగమని చెపుతూ తల్లి వెంటనే వెనకాల పరుగు. తల్లి కందకుండాలని పిల్ల పరుగు. హార్బరు గోడమీద నున్నవాళ్ళందరూ కూడా ఖంగారు పడ్డారు. ఆగమని పిల్లను పిలిచారు. పిల్ల ఆగకుండా పరుగు. ఈ హడావిడితో కూర్మయ్య అంబరవీధినుంచి, హార్బరు గోడ మీదకు దిగాడు. తనూ ఖంగారు పడ్డాడు. నాలు గడుగులు ముందుకేశాడు, పిల్లను పట్టుకొందామని. తన కంటె ముందు ఒకాయన పిల్లకు ఎదురుగా పరుగెత్తాడు పట్టుకుందామని. ఆయన్ను తప్పించుకుందామని పిల్లపక్కకు పరుగెత్తి ఓరకెళ్లి సముద్రంలో పడ్డది. గర్భనిర్భేదంగా తల్లి కెవ్వన కేకవేసింది. అందరూ మ్రోమని చైతన్యాలు లేక నిలబడిపోయారు. దూరాన్న ఉన్నవాళ్లు దగ్గరకు పరుగెత్తు కొచ్చారు.

పిల్ల పడడం తడువుగా కూర్మయ్యకూడా సముద్రంలోకి ఉరికాడు. ఇదంతా చెప్పడానికి ఇంతసేపు పట్టినా రెప్ప పాటులో జరిగింది. హార్బరులో ఉన్న స్టీమరులో నుంచి ఒక

మనిషి ఊరికాడు. ఇంతలో కూర్మయ్య పిల్లను చంకను పట్టు కుని పైకితేలి ఒక చేత్తో ఈదుతున్నాడు. స్టీమరువాళ్లు తాడు కట్టి Life Buoy ఒకటి విసిరారు. నీటిలో ఉన్న మనిషి దాన్ని కూర్మయ్యకు అందించాడు. స్టీమరువాళ్లు వాళ్లనిపైకి లాగారు.

ఇక్కడ గోడమీద ఎక్కడనుంచి వచ్చారో పెద్దగుంపు చేరారు పిల్ల తల్లి ఓ కేకవేసి మూర్ఛపోయింది. అక్కడున్న అంగ్లేయులంతా అవిడ దగ్గరచేరి ఉపచారాలుచేసి తెలివి వచ్చేటట్టు చేశారు. ఈలోపున అవతల వైపునుంచి కూర్మయ్య పిల్లను తీసుకువచ్చి తల్లికి వప్పచెప్పాడు. అవిడ కృతజ్ఞతకు మేరలేదు. అక్కడున్న అంగ్లేయులంతా అతని కరస్పర్శ చేసి చాలా అభినందించారు. తక్కిన వాళ్లంతా ఇకిలిస్తూ నిల బడ్డారు. పిల్ల తల్లి ఇతనికి కొంత బహుమానం ఇవ్వ బోయింది. పుచ్చుకోలేదు. పోనీ కార్లో ఇంటిదగ్గర దిగపెడతా నంది. అక్కరలేదని, వాళ్లదగ్గర సెలవుతీసుకుని జనాన్ని తప్పించుకుని, బీచికివచ్చి బట్టలు విడిచి ఆరేసుకుని, కొంచము అలస్యంగా ఇంటికి చేరాడు. 'ఏమి అప్పుడే వచ్చా రేమి! మమ్మల్ని విడిచిపోయి సుఖంగా కాశ్మీపేనా ఉన్నారు. పాపం ఎందుకొచ్చారు మళ్లీనీ, అలాగే పోకపోయినారూ, మేము ఈవల్లకాటి పట్నంలో ఏమైపోతే మీకేం" అంటూ స్వాగతమిచ్చింది భార్య వీధి గుమ్మంలోనే. 'ఏం నాన్నా సినీమాకు తీసుకెడతానని మా బాగాచేశావు. నువ్వు ఎప్పుడూ ఇంతేను. మమ్మల్ని ఎక్కడికీ తీసుకెళ్లవు' అంది కూతురు మూతి ముడుచుకుని. మరునాడు సినిమాకు వెళ్లారు. మూడోనాడు తిరుపతి వెళ్లవలెనని మూటా ముల్లీ కట్టు కున్నారు. ఈ హార్బరు గొడవంతా అన్నిపేపర్లలోనూ పడింది.

ఎప్పుడు ఎవరు తీసారో తెలియదుకాని ఇతని ఫోటోకూడా పడింది. తల్లీ కూతురూ ఆంధ్రపత్రిక చదువుతున్నారు. కూర్మయ్య పడుకున్నాడు. మెలకువగానే ఉన్నాడు. ఈ కథంతా గట్టిగానే చదివారు. కూర్మయ్య ప్రాణాలు ఉగ్గపట్టుకుని కూర్చున్నాడు. ఎక్కడా అదృష్టవశాత్తూ ఇతనిపేరు మట్టుకులేదు. ఆనాడు ఎవరడిగినా తన పేరు చెప్పలేదు.

'ఆ పిల్ల ఎంత అదృష్టవంతురాలో, ఆయన ఎంత పుణ్యాత్ముడో, ఎంత సాహసుడో, ఏమి మనిషండీ, అలాటి వాళ్ళను కంటితో ఒకసారి చూచినా జన్మ తరిస్తుంది. జన్మ ఎత్తగానే సరా, వెధవ జన్మ, మేమమ్మా మొగాళ్ళమని రెక్కలు విరుచుకు తిరగడం, తినడం తప్ప ఏముంది. ఎందుకొచ్చిన మగతనాలూ' అని పేపరుకింద పడేసింది సూరమ్మగారు. "ఏమండోయి నిద్రా ఏమిటి. దిక్కుమాలిన నిద్ర ఎప్పుడూ ఒకటే నిద్రా. అయినా ఎలా వస్తుందమ్మా. దరిద్రం అందుకనే మనకలా ఉంది. విన్నారా ఇది. ఆ మహానుభావు డెవరో ఎంతపుణ్యం కట్టుకున్నాడో? మీ జన్మలో ఎప్పుడన్నా ఒక్క పని ఇలాంటిది చేశారా. మీకు పెళ్ళాం పిల్లలే అక్కరలేదు. ఊళ్ళోవాళ్ళ జోలి మీకేం కావాలి? ఎవళ్ళెలా చస్తేం? మీరు సుఖంగా ఉంటే అంతే చాలు మీకు. ఛీ!" అని ఊరుకుంది. తల్లి కిందపారేసిన పేపరు పిల్లతీసి తిరగేసి 'అమ్మా చూడవే నాన్న ఫోటో పడింది' అన్నది. కూర్మయ్య ఉలిక్కిపడి తేలుకుట్టినట్టు లేచి కూచున్నాడు.

'నీ మొహం, మీ నాన్న ఫోటో ఎందుకు పడుతుంది. అంచమైన వారవా, తెలివైన వారవా! ఏది' అని పేపరు లాక్కొని చూచింది. అడుగున 'చిన్న పిల్లను మృత్యుగహ్వారంనుంచి రక్షించిన కూర్మయ్య ధైర్యశాలి' అని ఉన్నది.

'అయ్యో! అయ్యో! నిజమేనటండీ. మాట్లాడ రేమండీ. మిమ్మల్నే! బెల్లం కొట్టిన రాయిలా అలా ఊరుకుంటా రేమండీ! ఇదెక్కడి మొండితనమండి. ఈ దిక్కుమాలిన ఈత ఎప్పుడు నేర్చుకున్నారండి, నాతోటి చెప్పకుండామ. అయ్యో! మీ అమ్మ కడుపుకాలా. మీ మొహం మండా! మీరందులో గుటుక్కుమంటే ఇక్కడ ఈ పరాయి వూళ్ళో మేము ఏమి కావలసినదండీ. ఇక్కడ మేంపడి ముష్టిఎత్తుకు చావాలననేనా మీ ఉద్దేశం. ఎంత ఆలోచనండి. మేము బ్రతకడం ఇష్టంలేకపోతే కాస్తవిషం పారెయ్యకూడదూ మా మొహాన్ని. పెళ్ళాం పోరు పడలేక సముద్రంలో పడి చచ్చిపోయాడు అని పదిమందిచేత నన్ను ఛీ ఛీ అనిపించడానికటండి. ఇన్నేళ్ళువచ్చి ఇవేమి దుర్బుద్ధులండి. అయ్యో నా యిల్లు వల్లకాడుగాను. ఇందుకుటండి ఇక్కడకు తీసుకు వచ్చింది. నేరకపోయి బయలుదేరామమ్మా! ఇంతలోపల స్వయంపాక మని ఎప్పుడూ ఎరక్కపోతినే తల్లీ. శివరాత్రని ఇల్లు కదిలాం నాలుగు ఊళ్ళూ చూద్దాం ముచ్చటగాను అనుకున్నానే! అందరి మొగుళ్ళులాంటి వా రనుకున్నాను కాని నమ్మించి గొంతుక కోస్తా రనుకోలేదే తల్లి! అయ్యో అయ్యో! ఇంతదారుణం ఎక్కడేనా ఉందా. ఆ దిక్కుమాలిన పిల్ల పడితే మీరు తప్ప ఇంకెవ్వరూ లేరటండీ అక్కడ. అయ్యో మీ మొగతనం మండా! ఇందుకుటండీ మీ మగతనమంతాను. ఇంక మాకు పూళ్లూ చూపించద్దు, ఒల్లకాడు చూపించద్దు, నడవండి ఇంటికి, సాయంత్రం మెయిలు ఎక్కుదాం! చాలు అన్ని సరదాలూ తీరాయి. మిమ్మల్ని చేసుకున్ననాడే తీరాయి. అవ్వ!!! నా అదృష్టం పిల్ల అదృష్టం మంచిదిగనక, నా మొహాన్ని కాస్త కుంకుమ పెట్టుకునే యోగ్యత

ఉంది గనక కాని, ఇలాంటి దుర్బుద్ధు లున్నందుకు మీరు మళ్ళీ పైకిరాక పోయేవారే. ఏం! మాట్లాడరేం! తన్నంటే నేమి గోడనంటే నేమి! కాదు సిగ్గులేక ఫోటోకూడ తీయించు కున్నారు పాపం కులుకుతూను! చాలు! ఇంక ఇంటికి నడవండి!''

ఈ మహాప్రవాహానికి ఏమంటాడు కూర్మయ్య. ఎవరు మట్టుకు ఏమంటారు. జన్మ నక్షత్రఫలం కాకపోతే ఇందులో సబబూ సందర్భం ఏమైనా ఉందా ఆలోచించండి!

వేసేము నలుగురమూ మా మామూలు హోటల్లో మామూలు
ఋణం చెల్లించుకొని, కిల్లీలు నముల్తూ, సిగరెట్లు
కాలుస్తూ నెమ్మదిగా క్లబ్బుకు చేరి, దక్షిణపు వరండాలో
ప్రవేశించి, ఉన్న మంచికుర్చీలు నాలుగూ ఆక్రమించి బాతా
ఖాని ఆరంభించాము. ప్రతిరోజూ ఇది మా సాయంకాలం
ప్రోగ్రాము. మేమంతా నిరుద్యోగులమూ, దేశోద్ధారకులమూ
గనుక అందరికంటే ముందుగా మే మే హాజరయ్యేవాళ్ళము
క్లబ్బులో ప్రతిరోజూను. ముందువచ్చాం కనుక సహజంగా
మంచికుర్చీలలో బాగా గాలి వచ్చేచోట కూర్చుని బాతాఖానీ
కొట్టేవాళ్ళం. తరువాత వచ్చే పెద్ద మనుష్యులకు, ప్లీడర్లూ
మునసబులూ వగైరా, అందరికీ కష్టంగా ఉండేది. కాని
మమ్మల్ని ఏంచేస్తారు. మేమూ మెంబర్లమే. చందాలు సకా
లంలో వారూ ఇవ్వరు, మేమూ ఇవ్వము. ఇంక మాకు వి
రెక్కువేముంది. ఈ కుర్చీలకోసం పాపం కోర్టు పెందరాడే
విడిచి రావడానికి వీలయ్యేది కాదు. ఎటొచ్చీ క్లబ్బు ఆలస్యం
గా తెరిపించడానికి ప్రయత్నించారు కాని, కొందరు బుద్ధిమం
తులు, అది సాగలేదు. ఎందుచేతనంటే, పేకలు కోసం, బిలి
యర్డ్సు కోసం, క్లబ్బులోనే కాపురముండే ఉత్సాహవంతులు
కొంతమంది ఉన్నారు. వాళ్ళకోసం, ఎక్కువసేపు తెరిచి
ఉంచకపోతే రాబడి తగ్గిపోతుంది. ఏమైన డబ్బుతోపని
చూడండి!

మాక్లబ్బులో సన్యాసి రాజని ఒక పెద్దమనిషి ఉన్నాడు.
అతనూ ఒక పెద్దపొలిటీషియను (Politician) అనగా
దేవాంతకుడన్నమాట. ఎందుకు దేవాంతకుడో, ఎందులో

దేవాంతకుడో, ఏ దేవాంతకుడో, ఇదమిద్ధమని తెలలేదు. కాని దేవాంతకుడనే ఖ్యాతిమట్టుకు నిలిచిపోయింది. అతడు ఎప్పుడూ అతి నీటుగా డ్రెస్సు వేసుకొని త్రికాలములయందూ క్లబ్బులో హాజరయ్యేవాడు. అతన్నిగురించి చెప్పుకొనే, వినే, కథలు చాలా ఉన్నాయి కాని, అవన్నీ అటుంచి, అతనిలో ఒక్క విశేషముమట్టుకు చెపుతాను. అతనికి అద్భుతమైన మీసాలున్నాయి. మీసాలున్నవాళ్ళు ఎంతమంది లేరంటారేమో! అలాకాదు. 'రొయ్యకు లేదా బారెడు మీసము' జాతిలోవాడు కాడు ఇతను. ఈ మీసమే వేరు. ఈ తరహాయేవేరు ఈ ఒడుపే వేరు. అదో work of art అంటే నమ్మండి. ఆ మీసాన్నిపట్టే అతనికంత దేవాంతకుడనే పేరు వచ్చిందని నా నమ్మకం. ఏమైనా రాజమండ్రి అచార్లగారి గిరిజాలూ, మా సన్యాసిరాజు మీసాలూ ఎరగనివాళ్ళు మా మూడు నాలుగు జిల్లాలలోనూ లేరని నా నమ్మకం.

అతని మీసాలు కొంచెము serious గానూగౌరవ జనకంగానూ ఉన్నా, మనిషి మట్టుకు ఖులాసా అయిన వాడే. మాతో బాతాఖానీకి చేరుతుండేవాడు. మంచి sport అని నా నమ్మకం మాకందరికీ అతనిమీదా అతని మీసాలమీవాకూడా చాలా సదభిప్రాయమే. కాని ఒక్కొక్కప్పుడు, కొన్ని కొన్ని సందర్భాలలో మట్టుకు అతని మీసంచూస్తే మాకు ఒళ్ళు కాలుకొచ్చేది. ఒంటిమీద మాకు జెర్రులూ పాములూ పాకుతున్నట్టుండేది. దానికి కారణం మట్టుకు చెప్పలేము. అందుచేతమే మెప్పుడూ కలిసి కూడపలుకొక్కలేరు కాని - ఆ మీసం ఏ వంకనన్నా తీసేయిస్తే ఇతనేమౌతాడో అనిపించేది. నిర్హేతుకంగా అప్పుడప్పుడు ఇటువంటి అమాయకపు కోరికలు పుడుతుంటాయి చూడండి. మీ మాటేమో నేను చెప్పలేను కాని

మనలో మనమాట నా కప్పుడప్పుడు టాగూరుగారికి గడ్డం గిరి జాలూ లేకుండా ఉంటే ఎలా ఉంటుందీ అని,ఉస్మాను సాహెబుగారికి ఆ బొజ్జ లేకపోతే ఇంతవాడు అయిఉండేవాడా. అనీ, ఏవో ఇలాటి అవకతవక ఆలోచనలు, అప్పుడప్పుడు బయలుదేరుతుంటాయి. దానికేమి లెండి !

ఆరోజు మామూలుగా వచ్చి బాతాఖానీ ఆరంభించినాము. ఆ విషయాలూ ఈవిషయాలూ మాట్లాడుతోంటే మాకు తెలియకుండానే చుట్టూ జనాభా ఎక్కువయ్యారు అక్కడనుంచి political situation గురించి వాదోపవాదాలు కొంతసేపు నడిచాయి. అక్కడనుంచి గాలిమారి వర్తకంమీదికి కొట్టింది.

Foreign exchange ని గురించి Stock market ని గురించి మా Specialists ఏదో కోసినతరువాత బంగారం ధరల్లోకీ ధాన్యం ధరల్లోకీ దిగాం. ఈ సమయానికి సన్యాసి రాజుకూడా దిగాడు. ఒక్కసారి రెండుచేతుల్తోటి క్రాపు సవరించుకొని, తదనంతరం రెండు అరచేతులతోటీ మీసాగ్రాలు పైకితోసి ఒక కుర్చీలో సుఖాసీనుడయ్యాడు. 'ప్రస్తుతం ఒడుదుడుకు లెలా ఉన్నా మొత్తంమీద వ్యాపారంతో ఉన్న లాభం దేనిలోనూ లేదుసుమా' అన్నాడు సుబ్బయ్య, అదేదో ఇవాళ కొత్తగా వాడు కనిపెట్టినట్టు- వాడెప్పుడూ అంతే. లెండి. పైకి వట్టి మూర్ఖుడిలా ఉండి మధ్యమధ్యను, ఇటువంటి మహత్తరవిషయాలేవో సూత్రప్రాయంగా ప్రజలమీదపారేసి మౌనముద్ర వహిస్తాడు మళ్లీ కొన్నాళ్ళవరకూను.

'వినుడు వినుడు అని సభలో కేకలు' అన్నాడు మా రామారావు. చాలా పెద్ద Wit అని వాడి ఉద్దేశం లెండి. 'నిజమే! కాని మహచెడ్డకష్టం. ఎంత పెట్టుబడి పెట్టాలి. ఎంత శ్రమ

పడాలి! మాటలేనా ఏమిటి ఏర్తకమంటేను.' అన్నాడు, వెంకట్రావు Serious గా. వాడెప్పుడూ అంతే లెండి. 'ఇవాళ పప్పులో ఉప్పు ఎక్కువయింది' అని చెప్పాలంటే, Chamberlain అంత serious అయిపోయి చెపుతాడు. 'ఏలాగైనా ప్రతివాడూ ఈ ఉద్యోగాలకోసం దేవులాడ్డం మానేసి వ్యాపారంలోకి దిగవలసినదేనండీ' అన్నాడు ఒక Retired ఉద్యోగి.

'అందరూ అందలం ఎక్కితే మోసేవాడు ఎవడన్నట్టు, ప్రతివాడూ అమ్మేవాడైతే కొనేవాడు ఎవడు' అన్నా డొకాయన.

'అందరూ బియ్యమో బట్టలో అమ్ముతారేమిటి అందరూ తలొకటి అమ్ముతారు. ఎన్ని వ్యాపారాలు లేవు' అన్నాడు ఒక ఉత్సాహవంతుడు.

'కబుర్లేకాని బీదవాడు ఏమి వ్యాపారం చెయ్యగలడండి. అదంతా ధనికవర్గానికి చెల్లుతుందికాని' అన్నాడు ఒక చిన్న Socialist.

'ఏమి, వ్యాపారము చెయ్యతలచుకున్నవాడు ఏది అమ్మ కూడదు ఎందులో లాభంలేదు. మట్టిఅమ్మిలాభం తియ్యొచ్చు. మీరు అసహ్యం అనుకోకుండా ఉంటే వెంట్రుకలమ్మి లాభం తియ్యవచ్చును' అన్నాడు ఒక Congress orator.

'వెంట్రుకల వ్యాపారం ఒక్క వెంకటేశ్వరస్వామికే చెల్లింది కాని ప్రతివాడికీ ఎక్కడ. సాధ్యమౌతుందండీ' అన్నాడు, సన్యాసిరాజు నవ్వుతూ, మీసం దువ్వుతూ. ఎప్పుడూ వాదోపవాదాలలో కలుగచేసుకోని సన్యాసిరాజు మాట్లాడేసరికి అందరూ Serious గా ముఖాలు పెట్టి కూచున్నారు. హఠాత్తుగా గాలి చల్లపడ్డట్టయింది.

'వెంట్రుక లమ్మకానికి వెంకటేశ్వరులే అక్కరలేదు.

ఏ వెంకయ్య అయినా చెయ్యగలడు అపని' అన్నాడు మాశాస్త్రి. మా శాస్త్రికూడా అందుకునేసరికి వాతావరణం పూర్తిగా మారిపోయింది.

'ఎందుకొచ్చిన కబుర్లు పోనిద్దురూ! అలా అయితే ప్రతి మంగలాడూ ఆ వ్యాపారం చెయ్యవచ్చును' అన్నాడు సన్యాసిరాజు.

'దానికి మంగలికూడా అక్కరలేదు. ప్రతిమనిషీ చెయ్యొచ్చును. చెయ్యగలడు' అని నా నమ్మకం అన్నాడు శాస్త్రి.

'ప్రతిమనిషిదగ్గరా ఉన్నదే అయెను. ప్రతివాడూ అవి అమ్మకానికి చూపుతే కొనేవాడెవడండీ' అన్నాడు సన్యాసిరాజు మీసంమీద చెయ్యితియ్యకుండా.

'అలా అన్నారు బాగుంది. నేను తొందరపడి ఎక్కువ General గా అన్నమాట వాస్తవమే. కాని ఒక్కటిమట్టుకు మీరు ఒప్పుకోవాలి. ప్రతివస్తువుకీ ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క అవసరం విలువ అనుకోకుండా బయలుదేరుతుంది. ఆతరుణం కనిపెట్టి అమ్మాలి. అప్పుడు లాభం ఉండి తీరుతుంది' అన్నాడు శాస్త్రి బహుశాంతంగా.

ఏమిటి సంభాషణ ఇలా మారింది అనుకుంటూ, సిగరెట్లు ఊదేస్తూ ఊపిరి బిగపట్టుకు కూర్చున్నాం అంతా.

'అనుకోనివాటికి అనేకవస్తువులకు అవుసరం కలగవచ్చును. ధర రావచ్చును. కాని మన వెంట్రుకలకు మాత్రం ఎప్పుడూ రాదని నా నమ్మకం.'

'అలా తొందరపడకండి. మాటవరస కంటున్నాం. మీరేమి అనుకోకండేమి. రేపు మీ మీసాలకు ధర రావచ్చును' అన్నాడు శాస్త్రి నవ్వుతూను.

అమ్మ వీడితస్సా గొయ్యా ఇదా వీడి ఎత్తు అనుకున్నాం

అంతాను. సన్యాసిరాజు కొంచం తెల్లపోయాడు. ఆకాశం అంతా కారుకమ్మినట్టయింది. ఉరుములూ మెరుపులూ వచ్చేట్టుంది.

'మీరు మాటవరుస కన్నారుకాని, నా మీసాలు ఎవరి కాక్కావాలి లెద్దురూ'

'కావలిస్తేమట్టుకు మీరు అమ్ముతారు గనుకనా'

ఇదేమీ సన్యాసిరాజుకు అంతుపట్టలేదు. కొంచెం తీవ్రంగా మీసాలు మెలేసి,

'అంతగా కావలసి కొనే అమాయకుడేఉంటే ఎందు కమ్మను.'

'ఊరికేఅంటారుకాని, తరుణంవస్తే వెనక్కి తీస్తారు.'

'ఏమండోయి ఈ జన్మలో ఎన్నడూ వెనకతియ్యడ మనేది లేదు' అన్నాడు ఒక్కసారి సకిలించి, మీసం ఒడేసి.

'అయితే నిజంగా అమ్ముతారన్నమాట '

'నేచెప్తున్నదేమిటి—ముమ్మాటికీ.'

'ఏమి ఇమ్మంటారు.'

'కొనేవారిని రానివ్వండి. వేడుక బెరాలెందుకు.'

'నాకే కావాలి. ఏమి ఇమ్మంటారో చెప్పండి.'

మాకు బలేహుషారుగా ఉంది. సన్యాసిరాజు ముఖంలో కత్తివేటుకి నెత్తురు చుక్కలేదు. రాని చిరునవ్వును బల వంతంగా తెచ్చిపెట్టుకుని, 'నూరురూపాయలివ్వండి'అన్నాడు.

'ఖరారేనా?'

'ఖరారే.'

వెంటనే శాస్త్రి చెక్కురాసి ఇచ్చాడు. రాజు మూర్ఛ పోతా డనుకున్నాం. ఎలాగో ధైర్యం చిక్కపట్టుకొని, 'మంగలిని పిలిపించండి' అన్నాడు, మాట పాతాళంనుండి వచ్చింది.

'ఇప్పుడు తొందరలేదులెండి. తరువాత ఇవ్వొచ్చు. ఈ రసీదు సంతకంచేసి ఇవ్వండి.' అన్నాడు శాస్త్రి తొణక కుండా '18-4-1940 వ సంవత్సరమున...... కాపురస్తులు... శాస్త్రిగార్కి నా మీసములను, నూరు రూపాయలకు విక్ర యించడమైనది. సదరు మీసములను, మీరు అవసరము వచ్చి కోరినప్పుడు ఏ పేచీలేకుండా ఇవ్వగలవాడను. ఇందుకు ప్రతిఫలం నూరు రూపాయలు రొఖ్ఖం ముట్టినది.'

దానిపైన సన్యాసిరాజు సంతకం చేశాడు. ముగ్గురు సాక్షులుకూడ సంతకాలు చేశారు. మాట్లాడకుండా సన్యాసి రాజు చెక్కు జేబులో పెట్టుకొని ఆప్తమరణ వార్త విన్న వాడికి మల్లే ఎవ్వళ్లతోటీ మాట్లాడకుండా చక్కాపోయాడు.

ఒక్కక్షణం అంతా నిశ్శబ్దం అంతా ఒక్కసారి 'అరి' అన్నాం. ఫకాలున నవ్వాం. శాస్త్రిమట్టుకు ఈలోకంలో లేనట్టు, దృష్టి కన్యాకుమారి అగ్రంమీద నిలిపి సిగరెట్టు పీలుస్తున్నాడు.

'నీకేం మతిపోయిందా ఏమిటి శాస్త్రి' అన్నాం. దాంతో. 'ఉండవయ్యా భలేబేరం' అన్నాడు శాస్త్రి.

'నీ బొంద లాభంకూడాను' అన్నాను నేను.

'పాపం వాడిమీసాలు తీసేయించడానికి వందరూపాయలు తగలెయ్యాలా' అన్నాడు శర్మ.

'ఇదేం పుణ్యమా పురుషార్థమా' అన్నాడు మరొకాయన.

'వర్తకానికి పుణ్యమేమిటి. లాభం వస్తుందని నమ్మకంతో కొన్నాను. బాగా లాభిస్తుందని నా నమ్మకం. మీకు నమ్మకం లేకపోతే సందెం వేద్దాం కావలిస్తే.' అన్నాడు శాస్త్రి.

'పైగా ఇదొకటా. చాల్లే నవ్వీపోయేరు.' అన్నాడు శర్మ.

'వెర్రివాళ్లు నవ్వుతుంటారు. నవ్విపోదురుగాక. నాకేటి

సిగ్గు. అనో ఏదో అన్నాడు ఒక మహాభావ కవి.,

'పాపం సన్యాసిరాజు రూపాంతరం పొంది సన్యాసిరావు అవుతాడేమో' అన్నాడు శర్మ.

'చూదాంకాదూ' అని ఒకరు, 'మంచి బేరమే' అని ఒకరు, 'శాస్త్రి ఏం వెర్రివాడుకాదు; ఇందులో గూఢార్థం ఏదో ఉందని ఒకరు' 'ఏమిలేదు వాడిమీసాలు తీయించడానికి వీళ్లు తినికూచుని వేసిన ప్లాను' అని ఒకరు 'తిని కూచోలేక వాడిమీసాలు వీళ్ల నేమీ చేశాయో' అని ఒకరు, అనుకుంటూ సభ చాలించి, ఇళ్లకు బయలుదేరాము.

సుమారు నెలరోజులుగడిచాయి. క్లబ్బు atmosphere అంతా మారిపోయింది. ఇదేదో అందరూ personal loss లా feel కావడం మొదలెట్టారు. మా బాతాఖానీలు తగ్గిపోయాయి. సన్యాసిరాజు రోజుకురోజు బెంగపెట్టుకొని చిక్కిపోవడం మొదలెట్టాడు. అందరిలోకీ చీమకుట్టినట్టేనా లేనిది శాస్త్రి ఒక్కడే.

రోజూ సన్యాసిరాజు క్లబ్బుకువచ్చి, 'ఏమోయి శాస్త్రి, ఇవాళ తీసుకుంటావా ఏమిటి' అనడం—'అంతొందరలేదు లేవోయి, దానికో పెద్ద ఇదవకు ఊరికే గమ్మత్తుకుచేశాను. ఎప్పుడో ఒక్కప్పుడు తీసుకుంటా లెద్దూ' అనడం పరిపాటి అయిపోయింది.

ఒక రోజున మట్టుకు సన్యాసిరాజు మీసాలు కొంచెము కత్తిరించుకుని వచ్చాడు. అతనికేసి శాస్త్రి చుర చుర చూచి, 'ఏమయ్యా! నా మీసాలు ఇష్టం వచ్చినట్టు కత్తిరించి పారేస్తున్నావు' అన్నాడు. రాజు కొంచెము shock అయి, 'అది కాదోయి, కొంచెము గుబురుగా అసహ్యంగా ఉంటే కత్తిరించా, లేకపోతే ఎలాగ' అన్నాడు.

'చాల్లె, కొంచెము ఎదుగుతే బాగుంటుందనే కదా నీ దగ్గర అట్టే పెట్టింది. బాగా చేశావులే, ఈ మాటు కత్తిరిస్తే మాట దక్కదు' అన్నాడు శాస్త్రి.

'నన్ను చంపక నీ మీసాలు తీసుకుపోదూ. ఎరక్కపోయి ఈ బేరానికి వప్పుకున్నాను' అని సణుక్కుంటూ చక్కా పోయాడు రాజు.

'ఏరోయి శాస్త్రి ! నీ మీసాల బేరం ఏమయింది. ఏ మాత్రం లాభం వచ్చింది' అని రోజు రోజూ మేము వేళాకోళం. నవ్వండిరా ! నవ్వండి. నవ్వేన నాపచేనే పండింది అనే సామెతవిన్నారా. ఒకటో రకమైన offers వస్తున్నాయి. cent percent లాభం వచ్చేటట్టుంది.' అనేవాడు శాస్త్రి.

ఇలా ఉండగా ఏదో సందర్భంలో ఒక పెద్ద పార్టీవచ్చింది. ఆనాడు ఒక చక్కని సినిమాతార సంగీతం, ఒకావిడ నృత్యం ఏర్పాటు చేశారు. మా సన్యాసి రాజుకు సంగీత మన్నా నృత్యమన్నా మహాసరదా. ఇవి లేకపోయినా కలకల లాడుతూ పదిమంది ఆడవాళ్లు చేరారంటే సన్యాసిరాజు అక్కడ చేరాడన్నమాటే. ఆ రోజున మా ముఠాఅంతా క్లబ్బులో కలుసుకుని అక్కడినించి వెళ్లాలనుకున్నాం అంతాచేరాము. సన్యాసిరాజు, రాజు వేషంలా తయారయాడు. మామూలు కంటె మీసాల విషయంలో ఎక్కువశ్రద్ధ తీసుకున్నాడు. కొంచెం సెంటుకూడా రాశాడు. నిలువల్లా సెల్కుడెన్సు.
'Hello, Every body అంతా రెడీగా ఉన్నారా పోదామా కాశ్శేవు కూర్చొని వెడదామా, అన్నాడు సన్యాసిరాజు ఇదివర కుబెంగంతా మరచిపోయి.

మా శాస్త్రి అతన్ని ఎగాదిగా చూచి 'ఏమిట్రా వీడు, వెధవ వేషం-నా మీసాలతోటి అక్కడ షోకు జనాయిద్దా మనుకుంటు

న్నాడు కాబోలు. Dammit.'' అన్నాడు.

'ఏయి సన్యాసి రాజాహ్వాయ ప్రసిద్ధా! కొంచెము అవసరం వచ్చింది. దయచేసి నా మీసాలు ఇవతల పడెయ్యి' అన్నాడు శాస్త్రి. అందరం ఆశ్చర్యపోయాం. హఠాత్తుగా గుండె ఆగిపోతుందేమో అనుకున్నాం. ఒకడు పరుగెత్తి వెళ్ళి కొంచెము మంచినీళ్ళు తెచ్చి ఇచ్చాడు. మాట్లాడకుండా తాగాడు సన్యాసిరాజు. కొంతసేపటికి తెప్పరిల్లి, 'రేపిస్తాలే వోయి' అన్నాడు.

'Sorry ఇవేళ కావాలి'

'సరే అయితే పార్టీ కాగానే ఇస్తాను. ఇప్పుడు time కూడా లేదు'

'No, No క్షమించాలి. ఇప్పుడు అర్జంటుగా కావాలి. లేకపోతే చాలానష్టం వస్తుంది నాకు. ఎంతసేపు రెండునిమిషాలు. అరేయి మంగలిని తీసుకురారా!, అని బంట్రోతును కేకేశాడు శాస్త్రి. సన్యాసిరాజుకు కళ్ళనీళ్ళ పర్యంతం అయింది. మాకూ జాలివేసింది.

మంగలి వచ్చాడు, సన్యాసిరాజును యజ్ఞపశువులాగ నెమ్మదిగా సాయంపట్టి ఒక కుర్చీలో కూచోపెట్టాం. మంగలి వాడు నీళ్ళురాసి సబ్బురాయపోతుంటే వద్దని శాస్త్రి అడ్డుపెట్టి బహు జాగ్రత్తగా కత్తిరించమని హెచ్చరించి, చూస్తూ నిలబడ్డాడు, ఒక కాగితం చేతపట్టుకుని ఒక పక్క మీసం ఒక్క వెంట్రుకకూడా క్రిందపడకుండా, కాగితంలో పట్టి పొట్లం కట్టాడు శాస్త్రి. రెండో మీసానికి నీళ్లురాయబోయాడుమంగలి.

'అరేయి చాల్లేరా. మిగతాది రెండురోజులు పోయిన తరువాత తీసుకుంటాలే' అన్నాడు శాస్త్రి. తొణుకూ బెణుకూ లేకుండా మేమంతా నిర్ఘాంతపోయాం. రాజుకి పక్షవాతం

వచ్చినంత పనిజరిగింది.

'అదేమిట్రా' అన్నాడు శర్మ. కొంతసేపటికి ఊపిరి తెచ్చు కుని, 'ఇలాగైతే ఎలాగోయి' అన్నాడు అతిదీనంగా వాతేజ న్మలోనూ ఎప్పుడూ దేనికీ ఇంత పశ్చాత్తాపపడి ఉండడు.

'అవునయ్యా ఏమి చెయ్యమన్నారు నన్ను. న్యాయం చెప్పండి. సరుకంతా ఒక్కసారి తీసుకుంటే పాడయిపోదూ. ఇవేళ బేరం ఇంతవరకే ఉంది మళ్లీ అర్ధరురాగానే మిగతా సగం తీసుకుంటాను' అన్నాడు శాస్త్రి.

రాజుకు కళ్లనీళ్లు వచ్చేశాయి.

'బాబూ, శాస్త్రి నన్ను చంపకు. బుద్ధిలేక ఈ బేరానికి వప్పుకున్నాను. నీ డబ్బు నీకిచ్చేస్తాను. నాకు పూర్తిగా క్షవరం చేయించి పంపించు. నీ పెద్దలకీ నీకూకూడా పదివేల నమ స్కారాలు' అన్నాడు గద్గద కంఠంతో.

'Very sorry, లాభం లేనిదే ఏ పనీ చెయ్యకూడదని నా principle, brother' అన్నాడు శాస్త్రి యమధర్మ రాజులాగ, జన్మలో ఎప్పుడూ తప్పు చెయ్యనట్టు.

మా కందరికీకూడా రాజుమీద జాలివేసింది. కాని ఏమి చెయ్యగలం.

'అయితే సరే ఎంత ఇమ్మన్నావు' అన్నాడు రాజు.

'పైన ఒక్కవంద ఇయ్యి'

'అన్యాయం.'

'పోనీ ఇష్టం లేకపోతే మానెయ్యి. నాకు అంతవరకూ బేరం ఉంది. ఇంకొకడి కిచ్చేదానికే ఇద్దామనుకున్నాను.'

ఒక్క క్షణం నిశ్శబ్దం.

'సరే నీ యిష్టం. అలాగే కానియ్యి!' అన్నాడు రాజు, ప్రాణంపోయేటప్పుడు వప్పగింతలాగ.

'Very Good, అన్నాడు శాస్త్రి.

గబగబా చెక్కు రెండు వందలకూ వ్రాసి ఇచ్చాడు రాజు. శాస్త్రి అందుకుని పొట్లంకట్టిన మీనం రాజు కిచ్చేశాడు. రాజు వొళ్లుమండి అవతలికి గిరవాటేసి రెండో మీనంకూడా తీసేయించాడు. వేళ అయిందని మేమంతా బయలుదేరాము. రాజుమట్టుకు పాపం శ్మశానాన్నించి ఇంటికిపోయినట్లు పోయాడు.

'చెప్పలా cent percent లాభం తీస్తానని' అన్నాడు శాస్త్రి.

'చేశావులే ఘనకార్యం' అన్నాడు శర్మ కోపంగా, తన పుట్టి మునిగినట్లు.

సన్యాసిరాజు నాటినుంచీ నేటివరకూ పాపం క్లబ్బుకు రావడం మానేశాడు.

గాజుపాలెం టంకుర[illegible] ఉన్నా పల్లె[illegible]రే అనడానికి వీలులేదు. పల్లె[illegible]ంటే ఆ ఊరివాళ్ళకు వల్లమాలిన కోపంవస్తుంది. నాకైనా పల్లెటూరనడానికి ప్రాణం వప్పడంలేదు. ఏమంటే అవూరికి నాగరికతాలక్షణములు అన్నీ ఉన్నాయి. అనగా మోటార్లు, దోమలు, మలేరియా, కాఫీహొటళ్ళు, పంచాయతిబోర్డు, పరపతిసంఘం, పుస్తక భాండాగారం,పఠనమందిరము మొదలయినవన్నీ ఉన్నాయి. ఎటొచ్చీ గిట్టనివాళ్ళు కొందరు అక్కడ పంచాయతిబోర్డు తరచు గవర్నమెంటుచేతుల్లోనే ఉంటుందనీ, పరపతి సంఘానికి పరపతీ, డబ్బూలేవనీ, భాండాగారంలో పుస్తకాలు లేవనీ, పఠనమందిరములో పత్రికలు ఉండవనీ అంటారు; అంటేమట్టుకేమి. అసలు ఆ సంస్థలే లేని గ్రామాలు ఎన్నిలేవు. వంకలెంచబోతే వెనికేనా ఉంటాయి.

అవూళ్లోనూ మచ్చుకు కొందరు రాజకీయవేత్తలు, బావ కవులూ, భిమాకంపెని ఏజంట్లు,' కాబోయే సినిమా డైరెక్టర్లు, సోషలిస్టులు మొదలైన ప్రముఖులున్నారు. లేకపోలేదు. ఎటొచ్చీ పీల్చడానికి మంచిగాలి, తాగడానికి మంచినీళ్లూ, తినటానికి మంచితిండీ మట్టుకు కొంచెము తక్కువ. ఆ వూరికి ఈ స్వల్ప విషయాలొక పెద్ద లోటుగా భావించరు అక్కడివాళ్లు.

ఇవికేమిగాని ఇవన్నీ ఒక ఎత్తూ సుబ్బారాయుడొక యెత్తూను. అతనిపేరు తలుచుకు పొంగిపోతుంటారు అక్కడి వాళ్లు. ఇటువంటివాడు ఒక్కడు మనవూళ్లో వుండకూడదా అని విచారిస్తూంటారు పొరుగూరువాళ్లు. ఆ చుట్టుపక్కల

అతన్ని ఎరగనివాళ్లు లేరు. అక్కడే అన్నమాటేమిటి దూరాన్నించి వచ్చినవాళ్ళుకూడా అతన్ని ఎరిగి ఉంటారని అపూరువాళ్ళ వుద్దేశ్యము. పొరపాటున ఎవరన్నా 'ఎవరయ్యా ఆ సుబ్బారాయుడు' అన్నారో వాడినొక అడివిజంతువులా చూస్తారు అక్కడివాళ్ళు.

ఇంతఖ్యాతి ఎలా వచ్చిందంటారా! అదే చెప్పబోతున్నాను. అతను పెద్ద తెలివైనవాడని కాదు. అలా అని అతని తల్లిదండ్రులుకూడా ఎప్పుడూ అనుకోనేనాలేదట. అందగాడనే భ్రాంతి అతనికి కూడా లేదు. పెద్ద ధనికుడా అంటే కాదు. మరేమిటయ్యా? మంచివాడు; మొదటినుంచీ కాంగ్రెసులో ఉన్నాడు; మంచివర్కర్ అని పేరు. అనగా మీటింగులు ఏర్పాటుచెయ్యడము, నోటీసులు పంచి పెట్టడము, పదిమందినిచేరదీసి కాఫీహొటల్లో కబుర్లు చెప్పడం, మీటింగులో ఉపన్యాసము మధ్య నిర్హేతుకంగా లేచి, భోజనాల దగ్గర పద్యం మధ్యను 'భోజనకాలే గోవిందనామ స్మరణ' అన్నట్లు, మహాత్మాగాంధీకీ......భారతమాతకీ.......వగైరా అంటూండడం జనంచేత జై అనుపిస్తూఉండడం, ఇటువంటి వర్కు బోలెడంత చేసేవాడు. గాంధీగారితోటే అసహాయోద్యమము ప్రారంభించాడు. అతఃపూర్వమే తనకాఉద్దేశము ఉన్నట్లు మిత్రులు కొందరితో రహస్యంగా చెప్పాడు.

అతను జైలుకు వెళ్ళాడా లేదా అన్న సంగతి ఇప్పటికీ వివాదాంశమే. ఒకసారిమట్టుకు అతను అయిదారుమాసములు గ్రామాంతరమువెళ్ళి తిరిగి వచ్చినప్పుడు 'ఎక్కడికి వెళ్ళావురా సుబ్బారాయుడూ' అని ఒక పెద్దమనిషి అడుగుతే మందహాసంతో 'శ్రీ కృష్ణజన్మస్థానం చూచి వస్తున్నాను' అన్నాడుట. వెంటనే పొలిమేరనే ఆపి మేళతాళాలతో ఎదురు

సన్మాహం వెళ్ళి గ్రామస్థులంతా అతనికి సన్మానపత్రము సమర్పించి ఊరేగింపుతో చేర్చారు. కొందరు గిట్టనివాళ్లు అతను జైలుకు వెళ్ళలేదన్నారు. అయితే అతడెప్పుడన్నా అబద్ధం ఆడడము ఎరుగుదువా అన్నాడు అతని మిత్రుడు.

అబద్ధమాడాడని నేననలేదు. అతను చెప్పిందికూడా ఊరికే చూసివస్తున్నా నన్నాడు కాని ఉండివస్తున్నాను అనలేదన్నాడు అవతలవాడు. ఇల్లా ఎన్నాళ్లో వాదోపవాదాలు జరిగినయి. ఈ విషయము తేల్చడానికి ఒక పంచాయతీ ఏర్పాటు చేదామనుకున్నారు. కాని దానిలో బ్రాహ్మలు ఉండవచ్చునా కూడదా అనే పేచీ వచ్చింది. ఆ పైని ఒక మహమ్మదీయుడుండకపోతే బాగుండదని ఒకరన్నారు. శుభ్రమైన ఆడవాళ్లు కూడా ఒకరిద్దరుంటేగాని వీల్లేదన్నారు యువకులంతాను. ఈ పేచీలన్నీ ఎందుకని అసలు పంచాయతీ చెయ్యడమే మానుకున్నారు. అతని జైలువిషయము ఆంధ్రపత్రికలో పడలేదు. కనుక ఆ పత్రికను బహిష్కరించాలని కొందరు ప్రచారము సాగించారు. సుబ్బరాయుడుని సలహా అడిగితే వాళ్లుమట్టుకు ఎన్నని వేస్తారు అన్నాడు మందహాసంతో. అందుచేత అక్కడ పఠనమందిరానికి నాగేశ్వరరావుగారు ఉచితంగా పంపిన న్నాళ్ళు ఆ పత్రికను బహిష్కరించకూడదని నిశ్చయించుకొన్నారు.

అతను తరచు పత్రికలకు వ్యాసాలు వ్రాస్తుంటాడనివదంతి. ఏ పత్రికలోనూ మట్టుకు అతని పేరుతో ఏ వ్యాసమూ యింత వరకూ కనపడలేదు నాకు. పొరబాటు. ఆ వూళ్లో ఏ యింట్లో చూచినా ఇతను వ్రాసిన వ్యాసము ఒకటి అద్దమువేసి చట్రముకట్టి కనపడుతుంది. గాజుపాలెం చరిత్రనుగురించి అతను కొన్నాళ్ళు పరిశోధనచేసి, అదిచాలా పురాతనమైన గ్రామమనీ

ఆ గ్రామములో అనాదినుంచీ చక్కనిగాజులు తయారుచేసే వారనీ, అందుకే ఆ గ్రామానికి గాజుపాలెం అని వచ్చిందనీ, దానికి తార్కాణంగా ఊరికి ఉత్తరము వైపున ఉన్న దిబ్బ తవ్వుతుంటే చాలా గాజుపెంకులు దొరికాయనీ ఈ మొదల యిన ఆధారములతో ఋజువుచేస్తూ ఆ గ్రామంయొక్క పురా తనత్వం నిరూపించాడు మన సుబ్బారాయుడు. దానితో యితను గొప్ప పరిశోధకుడనే పేరువచ్చింది. ఆంధ్రులలో అనేక మందిలో అణిగి ఉన్న ఈ పరిశోధనాశక్తి పూర్తిగా అణగిపోకుండా అందరూ ప్రోత్సహించవలెననీ, ఇటువంటి మహనీయులకు ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు ఒక Ph.D. అన్నా ప్రసాదించి తమ్ము తాము గౌరవించుకొనుట విధ్యుక్త ధర్మమనీ, గవర్నర్లకూ, మంత్రులకూ వృధాగా బిరుదు లివ్వడముకంటె ఇలాంటివాళ్ళ కివ్వడములో చాలా సబబుం దనీ కొంత ప్రచారము సాగింది.

కొంపతీసి కళ్ళుమూసుకొని విశ్వ విద్యాలయమువారు ఇతనికి పట్టా ఇస్తారేమోనని భయపడి ఆ వూళ్ళో ఉన్న ముసల్మాను యువకుడు వేరే ఒక వుపన్యాసము వ్రాశాడు. అతను జిన్నాగారికి శిష్యుడు. ఆ గ్రామం పూర్వం మహమ్మదీయుల అధీనములో ఉండేదనీ మహమ్మదు ఘజనీ అనే నవాబుచేత స్థాపింపబడినదనీ అప్పటినుంచీ ఘజనీ పాలెం అని పేరువచ్చిందనీ అది క్రమక్రమంగా గాజుపాలెం క్రిందికి మారిందనీ ప్రస్తుతంఅక్కడఉన్న మహమ్మదీయులు ఆ ఘజనీ సంతతివారనీ, మహమ్మదీయులకు అన్యాయము చేసి వారికి నామరూపము లేకుండానే చేయవలెననే దురుద్దేశము కాంగ్రెసుకు పుట్టి యిటువంటి సుబ్బా రాయుళ్ళచేత ఇటువంటి దుష్టప్రచారము చేయిస్తోందనీ

ఈ విషయములో తొందరపడి విశ్వవిద్యాలయమువారు గవర్నర్లకూ వారి మంత్రులకూ ఇచ్చినట్లుగా యీ సుబ్బారాయళ్లందరికీ డిగ్రీలు యివ్వకూడదనీ యీ వ్యాసంయొక్క కాపీలు ఒకటి జిన్నాగారికి, ఒకటి వైస్రాయిగారికీ, హమీదు ఖానుకూ అలీబేగుకూ అంద చేయుడమైనదనీ ప్రకటించాడు. ఆ మహమ్మదు ఘజనీ ఎవరో, ఎప్పటివాడో, వాడు అక్కడి కెందుకొచ్చాడో, యీ గ్రామం ఎందుకు ఏర్పాటు చేశాడో, యీ వున్నవాళ్లు వాడి వంశీయులయితే వాళ్లకు కానీ వాళ్ల బంధువులకు గాని చుట్టుపట్లకాని ఎవళ్లకీ ఘజనీ పేరు ఎందుకు లేదో? యీ మొదలయిన స్వల్పవిషయాలకు కొన్నిటికి సరియైన సమా ధానము కనుపించదు. అయినా, కాదని కొట్టిపారెయ్యడానికి కూడా వీలులేదు చూడండి. ఇంక ఎటొచ్చీ దాన్నికూడా ఏ ట్రిబ్యూనల్ కేనా రెఫర్ చేస్తే వాళ్లు ఏమంటారో?

ఏనాడో పగిలిపోయిన భూగర్భంలో దాగివున్న గాజు పెంకులసాక్ష్యం నమ్మడమా లేక సజీవులై అవంశీయులమని చెప్పే మానవులమాట నమ్మడమా అనే మీమాంసలో పడ్డారు విశ్వవిద్యాలయమువారని తెలిసింది. అందులోనూ హైదరాబాదు నవాబుగారి ద్రవ్యసహాయము పొందినతరువాత ఇటువంటి విషయాల్లో తొందరపడకూడదని నిశ్చయించారు. సరే ఆ విషయము అలా ఉంచండి. సుబ్బారాయుడు అనహా యోద్యమ ప్రచారకుడని కదూ చెప్పాను. సహజంగా అంద రికి మల్లేనే ఇతనికీ గాంధీగారంటే విపరీతమైన గౌరవము. అందుచేత అన్ని విషయాల్లోనూ ఆయనను అనుకరించ డమే, జీవితాశయంగా పెట్టుకున్నాడు. ఆ ఆశయం చాలా వరకూ సాధించాడు కూడాను. ఆ విషయములో పటేలు,

పట్టాభి, రాజాజీగార్లకంటే కూడా నాలుగుమెట్లు పైనే ఉన్నా డని చెప్పవచ్చును. ఇన్ని మాటలెందుకు. ఒక్క విషయము చెపుతే మీకే తెలుస్తుంది. గాంధీగారు తాను భగవద్గీతను దొడ్లోకి పోయినప్పుడు కూడా చదివేవాడనని చెప్పి నప్పటి నుంచీ మా సుబ్బారాయుడుకూడా భగవద్గీత పారాయణ పాకీ దొడ్లోనే చేసేవాడు. అంటె నేను చెప్పదలచుకొన్న దేమి టంటే అంత స్వల్పవిషయములో కూడా మహాత్ముని ఆద ర్శము మరువలేదన్నమాట. మహాత్మునితోపాటు యితనూ భోజనం మానేశాడు. ఒకసారి నేను కలుసుకున్నప్పుడు "ఏమోయి సుబ్బారాయుడూ! ఖులాసాగా ఉన్నావా" అన్నాను. చాలా జాలిగా ముఖంపెట్టి 'గురూజీ ఈ మధ్యను భోజనం మానేశాను. ఏదో కొంత మనకు చేతనైనంతవరకూ త్యాగం చెయ్యాలికదా, ఇంతకంటే నేను ఏమి చెయ్య గలను?' అన్నట్లు చెప్పడం మరచిపొయ్యా అతను హిందీ నేర్చుకొన్నాడని; నేర్చుకోవడమే కాదు, హిందీలోతప్ప మాట్లాడేవాడు కాదు. తెలియనివాళ్లు నాబోటివాళ్లు ఉంటే ముందు హిందీని మాట్లాడి మళ్లా తెలుగున చెప్పేవాడు.

'నిజమే తప్పకుండా త్యాగం చెయ్యవలసినదే; అందు లోనూ జిహ్వాచాపల్యం జయిస్తే ఇంక కావలసినదే మున్నది, అయితే మరి ఏమి పుచ్చుకొంటున్నావు. బ్రతికున్నాళ్లూ ఏదో కొంత పడవలెకదా లోపల' అన్నా.

'ఏదోకాస్త హల్వా, కోవా, పాలు, బాదంపప్పు, పూరీ, పళ్లు....ఇలాటివేవో, ఏది లభ్యమైతే అది' అన్నాడు అతి వినయంగా.

అప్పుడప్పుడు ఇతనూ ఉపన్యాసాలు చేస్తూ ఉండేవాడు. వారానికి ఒకరోజు ఎవళ్ళతోటీ మాట్లాడేవాడు కాడు. ఇంక

బ్రహ్మచర్యవిషయంలో ఇతడు పుట్టుబ్రహ్మచారి, అందుచేత బాధలేదు. గాంధీగారు గావంచాకట్టడం ప్రారంభించగానే ఇతనూ గావంచా ప్రారంభించాడు. అనలు కౌపీనధారణ చేస్తాడేమోననికూడా భయపడ్డాను; ఆ గ్రామస్థుల అదృష్ట వశాత్తూ అపనిమట్టుకు చెయ్యలేదు. ఈ కారణాలచేత ఇతనికి గాజుపాలెం గాంధీ అని బిరుదు వచ్చింది. ఎప్పుడిచ్చారు; ఎవరిచ్చారంటే అది వేరే నంగతి. మనదేశంలో ఆచార్యా, సర్దారు, దేశబాంధవ, ఇత్యాదులులాంటిదే ఇదీని. ఎవరో శుభముహూర్తాన అన్నారు! అది ప్రచారమైపోయి ప్రజలనోట నిలిచిపోయింది. ఆ బిరుదు వచ్చినప్పటినుంచీ ఇతడు అఖరికి ఒక నంస్థ అయిపోయాడు. అక్కడ భాండాగారము, పఠన మందిరంలాగ.

అదివరకు ఏమి చేసినా చెయ్యకపోయినా, ఈ అవతారం పొందినప్పటినుంచీ, ఏ పనీ చెయ్యడం మానేశాడు. ఇంతటి మహానుభావుడా వూళ్లో వెలిసినప్పుడు, ఇతన్ని భరించడం గ్రామస్థులు విధ్యుక్తధర్మంగా భావించారు. ఇంతకూ ఒంటరి వాడు. ఏమంత ఖర్చుంది గనుక, ఎవరికి చేతనైన నహాయం వారు చేసేవారు. కాఫీహొటలువాళ్లు ఫలహారా లిచ్చేవారు. ఇతడు భోజనం చెయ్యడు కాదుమరి! బట్టల వర్తకులు రెండు జతలు అంగవస్త్రాలిచ్చేవారు. ఇలాగే అనుకోండి.

ఇంతగా ఇతన్ని కనిపెట్టుతున్నవాళ్లకు ఇతనివలన ఉప యోగం ఏమిటంటారా! రమణమహర్షివల్లా, అరవిందుని వల్లా ఏమి ఉపయోగమో, ఇతనివల్లా అంతే అనుకోండి. అతను ఉండడమే మహోపకారం దేశానికి!

ఇలా అని అతను ఊరుకునే వాడనుకుంటారేమో! పాపం నిజం చెప్పవద్దూ! అతనికి చేతనైనంత వరకు, ఎవరు

ఏ సహాయం కోరితే ఆ సహాయం చేసేవాడు. అదే అలవాటై పోయి, అతన్ని కోరకపోయినా అన్నిటిలోనూ కలుగచేసుకుని ఏదో రంవా మీవా పెడుతూ ఉండేవాడు. వద్దనడానికి వీలు అయ్యేదికాదు. అంతటివాడిని పట్టుకొని 'బ్రదర్ నీకేం తెలియదు. ఈ విషయంలో నువ్వు కలుగజేసుకోవద్దని' ఎవడన గలడు, ఏ సర్పాదు వీరవల్లాలాంటి వాడె తప్పు? అందుచేత ఆ వూళ్లో పెండ్లి సంబంధాలు కుదర్చడం దగ్గరనుంచీ పీను గలను మొయ్యడం వరకూ సమస్త వ్యాపారాలు ఇతని మీదుగా నడచేవి. ఈ బాధ ప్రజల కలవాటైపోయి అతడు ఏమి చెప్పితే అది వేదవాక్యంగా శిరసా వహించేవారు. కాని ఆ వూళ్లోవాళ్లు నెత్తిన పెట్టుకున్నారుకదా అని పొరుగూరు వాళ్లు ఎందుకు నెత్తి నెక్కించుకుంటారు. అలా ఇతను చెప్పినట్లు పొరుగూరువాళ్లు వినకపోయారా చేంబర్లేనుకూ హిట్లరుకూ సంభాషణ కుదరకపోతే యుద్ధము వస్తుందని భయపడ్డాము చూడండి! అంత హంగామీ జరిగేది ఇక్కడ కూడాను. ఈ వూరువాళ్లూ ఆ వూరువాళ్లూ కొట్టుకోడానికి సిద్ధమయ్యారన్నమాట. దినికి తార్కాణంగా ఈ మధ్యను ఒక చిన్న తమాషా జరిగింది. ఇప్పుడు తమాషాగావున్నా అప్పుడు మట్టుకు తీవ్రంగానే వుండేది.

గాజుపాలెంలోనే వెంకట్రామయ్య అని ఒక సంపన్నగృహస్తు. అతనికో కూతురు. ఆ పిల్లకు వివాహం చెయ్యవలెనని వెంకట్రామయ్య సంకల్పించుకొన్నాడు. ఆయన పూర్తిగా సంకల్పించక ముందే సుబ్బారాయుడు సంబంధాలు చూడ మొదలు పెట్టాడు. ఈసంకల్పం జోలెందుకు! పిల్ల పుట్టడమే మిటి! దీని మొగుడు ఎక్కడున్నాడా అని సుబ్బారాయుడు ఆలోచించడమేమిటి అనుకోండి! కాని తీరా పిల్లకి పెళ్ళి

ఈడొచ్చి పెళ్ళి చేద్దామని తల్లిదండ్రులనుకునే సరికి, సుబ్బా రాయుడొచ్చి, పిల్లకి ఇప్పుడు పెళ్ళివల్లకాదన్నాడు. ఇంతచిన్న తనంలో పిల్లకి పెళ్ళేమిటి చదివించాలికాని అన్నాడు. అధమం పదునాలుగేళ్ళనా వస్తేకాని వీల్లేదన్నాడు. నేను ఉన్న పూళ్ళోనే ఇంత చిన్నపిల్లకి పెళ్ళి జరిగిందంటే ప్రపంచం ఏమనుకుంటుంది. కాస్త నా మర్యాదేనా ఆలోచించి, ఇప్పుడు వివాహ ప్రశంస చెయ్యకండి అన్నాడు.

ఒక్కత్తే పిల్ల. శుభమాలని పెళ్లి తలపెట్టుకుంటే పానకంలో పుడకలాగ వీడెక్కడ దొరికాడు మన కనుకున్నారు. నెమ్మదిగా చెప్పారు. బ్రతిమాలారు. వెంకట్రామయ్య భార్య కళ్ళ నీళ్ళెట్టుకుంది. తండ్రికి కబురంపి ఆయన చేతచెప్పించింది. ఎవళ్ళు చెప్పినా ససేమిరా వల్ల కాదన్నాడు.

మనకు ఈ వెర్రిముండాకొడుకు అజ్ఞఏమిటి, కానివ్వండి. వాడేంచేస్తాడో చూదామన్నాడు వెంకట్రామయ్య మామగారు.

ఈ సంగతి సుబ్బారాయుడు పసికట్టి మీరు వివాహం తలపెట్టి, విఘ్నేశ్వరుడికి మీరు కట్టినాడు నేను ఉపవాసదీక్ష ప్రారంభిస్తాను అన్నాడు. దానితో హడలెత్తి వాళ్ళ ప్రయత్నం మానుకున్నారు.

సరే ఎలాగైతేనేమి, పిల్లకు పదునాలుగేండ్లుకూడా నిండ వచ్చినాయి. ఇంక సంబంధంచూడడం విషయంలో సుబ్బారాయుడే బాధ్యత వహించాడు. మొత్తంమీద దేశమంతా గాలించి శుభ్రమైన సంబంధం తెచ్చాడు. వధూవరులకు ఒకళ్లకొకళ్ళు నచ్చారు. ఇంక కట్నాలప్రశంస వచ్చింది వెంకట్రామయ్య మూడువేలవరకూ సిద్ధపడ్డాడు. వరుడుతండ్రి అధమం 'అయిదువేలేనా రాబట్టకపోతే నా ప్రయోజకత్వం ఏమిటనుకున్నాడు.' 1116 దగ్గరనుంచి బేరం ప్రారంభమ

యింది. పాట మూడువేలదాకా పెరిగే టప్పటికి సుబ్బారాయుడు చక్కావచ్చాడు. నేను బ్రతికుండగా కట్నం ఇవ్వనివ్వనన్నాడు. 'ఏదోపోనిద్దురూ' సుబ్బారాయుడుగారూ! అదేదో లాంఛనంకింద వెళ్లిపోతోంది దేశంమీద. వారుమన్ని బాధించనంతసేపూ, వారిముద్దు చెల్లించడం మనకు విధాయికం. అందుచేత ఏదో మూడువేలవరకూ వచ్చింది. ఇంక సంతటితో పైనలు చేయండి' అన్నాడు వెంకట్రామయ్య.

'ఏమండోయి, ఈ విషయంలో మీరేమీ మాట్లాడకండి' అన్నాడు. పిల్ల మీపిల్ల అయినంతమాత్రాన మీ ఇష్టము అనుకున్నారేమో. సంస్కరణకు సంబంధించిన విషయాల్లో మాట్లాడడానికి మీకేమీ అధికారంలేదు. పైగా ఆ పెద్దమనిషి (అనగా వరుడు తండ్రి) కట్నాలు పుచ్చుకోడం మహాపాపమని తనెన్నడూ అలా చేయననీ అనేకచోట్ల ఉపన్యాసాలిచ్చాడు. ఇప్పుడెలా పుచ్చుకుంటాడో చూస్తాను. అవసరమైతే నేను అమరణాంతం ఉపవాసం చేస్తాను. లేదన్నారా, నేను అన్న దానిలో తప్పున్నదని కాని, నా ఉపవాసదీక్ష అక్రమమని కాని ఆ పెద్దమనిషి పబ్లికులో ఉపన్యాసంలో చెప్పినమాట వాగ్దానంగా భావించడానికి వీలులేదనికాని ఎవరన్నాఅంటే ఈ వ్యవహారంలోనుంచి నేను విరమిస్తాను. తరువాత మీరూ మీరూ ముక్కొట్టుకోండి. అవసరమైతే ఈ విషయం Federal Court Judge కి refer చెయ్యడానికి నా అభ్యంతరం లేదు, అన్నాడు సుబ్బారాయుడు. ఇలా సుమారు మూడు మాసములు రాయబారాలూ, ఉత్తర ప్రత్యుత్తరాలూ జరిగినాయి. పిల్లవాడి కెలాగయినా ఈ పిల్లనే చేసుకుందామని బుద్ధిపుట్టింది. వెంకట్రామయ్యకూ భార్యకూ ఈ సంబంధము ఏమైనా సరే దాటనివ్వకూడదనీ ఉన్నది.

అందుచేత ఈ గొడవంతా ఎందుకు ఏదో రహస్యంలో, కట్నం అనకుండా మిమ్మల్ని సంతోషపెడతాము. ముహూర్త నిశ్చయం చేయించవలసిందని కబురుచేశాడు, వెంక ట్రామయ్య. మగపెళ్లివారుకూడా అందుకు మెత్తపడ్డారు.

ఇంతవరకూ వచ్చినవాకా ఉన్నసమయంలో మహాత్ముడు రాజకోటవిషయంలో Gwyer గారి తీర్పును వదలుకుంటు న్నాననీ, మీరు ప్రభువునూ మంత్రినీ నమ్ముకోవడమే మంచి దని తెలియపరిచాడని వార్త పిడుగులా చక్కా వచ్చింది.

ఇంకేముంది, సుబ్బారాయుడుకి ఉన్న మతి కాస్తా పోయింది. ఒకరోజల్లా ఉపవాసంచేసి మౌనవ్రతం చేశాడు. ఒక నిశ్చయానికి వచ్చాడు. ఈ వివాహంతో తనకేమీ సంబంధం లేదనీ మీ ఇష్టమువచ్చినట్లు చేసుకోవచ్చుననీ మీ మీ హృద యాల్లో పరివర్తన రావలసినదేకాని నాబోటివాని బలవంతము మీద మీరు ఏమీ చెయ్యకూడదనీ, ఇంతవరకూ మిమ్మల్ని తొందరపెట్టి మీ మనస్సుకు బాధ కలిగించినందుకు మన్నించ వలసిందనీ, ఉత్తరంరాసి ఈ సంగతి మగపెళ్లివారికే వెంక ట్రామయ్యకూకూడా తెలియపరిచాడు. అమాయకుడు, పాపం వెంకట్రామయ్య సంతోషించాడు. కాని ఈ ఉత్తరం అందడం తోనే పెళ్లికొడుకు తండ్రికూడా సంతోషించాడు కాని అది మరో అందుకు. అయిదువేలకూ ఒక్క దమ్మిడీ తక్కువైతే మీరు మరో ప్రయత్నం చేసుకోవచ్చునని మామూలు పాట ప్రారంభించాడు. వెంకట్రామయ్య బిక్కమొహం వేసుకొని, 'ఏమి సుబ్బారాయుడు బాబూ మమ్మల్ని ఇలా గంగలో ముంచారు' అన్నాడు.

'ఇదేమి నా ఒక్కడి కోసమూనుటయ్యా, దేశక్షేమంకోసము గాంధీగారు కొత్తపద్ధతి అవలంభిస్తే నేనుకూడా ఆ దారి

తొక్కాలంటావా వద్దంటావా! ఆయన తెలివి తక్కువ వాడం టావా నేను తెలివితక్కువ వాడినంటావా, అందుచేత ఇంక మీరూ మీరూ ఏదో మోస్తరుగా ఫైసలు చేసుకోడం మంచిది'' అన్నాడు. సరే తప్పుతుంది కనుకనా, వెంక ట్రామయ్య అయిదువేలూ ఇచ్చి పెళ్లి చేశాడులెండి. దానిపైన సుబ్బారాయుడు ఇలా చేశాడని అందరూ తలొక మాటా అనడం మొదలెట్టారు. అందుకని సుబ్బారాయుడు గాంధిగారి నూతన పంథాను గురించి విపులంగా వ్యాఖ్యానంచేస్తూ ఈ సందర్భంలో తనకూ మగపెళ్లి వారికీ జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలు, ఒక పెద్దకట్ట తెనుగు పత్రికలన్నిటికీ ప్రచు రణార్థం పంపాడు.

అదంతా సుమారు వారం రోజులకు సరిపడ్డ Matter అవుతుందనీ, ఎప్పుడేనా పత్రికా కార్యాలయాల్లో సమ్మె వచ్చి నపుడు ఇది ఉపయోగించ వచ్చుననీ కూడబ్బచేయించి అట్టే పెట్టారట, పత్రికాధిపతులు.

చెరువులో మధ్యగా బెడ్డవేస్తే కెరటాలు బయలుదేరి చెరు వంతా వ్యాపించినట్లు ఎక్కడో రాజకోట వ్యవహారం గాజు పాలెంవరకూ ఎలా పాకిందో, ఎంత వ్యవహారం జరిపిందో చూచారా! అందుచేత ఇంతకూ మా సుబ్బారాయుడు గాంధీ బిరుదుకు అర్హుడంటారా కాదంటారా! అవసరమైతే ఇది కూడా Gwyer కు refer చెయ్యడానికి మా అభ్యంతరం ఎంతమాత్రం లేదు.

జపాలెం గాంధీకీ జై!!!

క్కాలమానం ఏమీ బాగాలేదు. ఏమీ బాగా లేవంటే బొత్తుగా బాగాలేదన్నమాట. జవహరులాలు చెప్పినట్లు, విదేశవ్యవహారాలుచూస్తే ఏ వేళప్పుడు ఏమి కొంపమునుగుతుందో అని భయంగా ఉన్నది. స్వదేశంలో కుడివారు, ఎడమవారు, ఇవి రెండూ లేనివారు, ముందువారు వెనకవారు, మధ్యవారు, ఇలా పేర్లు పెట్టుకొని అఘోరిస్తున్నారు కాంగ్రెసులో. తక్కిన వాళ్ళసంగతి చెప్పనే అక్కరలేదుకదా. సంస్థానాల సంగతి అలా వున్నదికదా. మంత్రులసంగతి ఇలా ఉన్నదిగదా. పోనీ వాళ్ళందరి గొడవా ఎందుకు, నా సంగతి చూదామా అంటే, అది మరీ అధ్వాన్నంగా ఉన్నది. ఇంక ఎటొచ్చి పెద్ద వాళ్ళ తోటి పోల్చుకొని సంతోషించాలంటే, నా వ్యవహారంకొంచెము ఇంచుమించుగా మదరాసు గవర్నమెంటు వ్యవహారంలా ఉన్నదంటే నమ్మండి. గవర్నమెంటు కోశాగారంలాగనే ఉన్నది నా పర్సుకూడాను. ఎటొచ్చి ఇంకా ఖాళీగా ఉంది. నేనూ గవర్నమెంటులాగ అప్పు పుట్టించి కొన్నాళ్ళు కాలక్షేపం చేద్దామనుకున్నాను. నా ప్రయత్నాలు కూడా వారి ప్రయత్నాలవలెనే విఫలమైనాయి. కానైతే వారికి under writers దొరికారు. మనకు ఇంకా ఎవ్వరూ దొరకలేదు. దొరుకుతారనే నమ్మకం కూడా లేదు.

మన ప్రధానమంత్రిలాగా నేనూ అహర్నిశాలు కొత్త పన్నులను గురించి ఆలోచిస్తూ ఉంటాను. ఎవరెవరికి, ఎలా, ఎలా వేస్తే, వసూలు చెయ్యడానికి వీలౌతుందీ అని. కాని మహ చెడ్డ కష్టంగా ఉన్నది. అసలు Victims ఎవ్వరూ దొరకడంలేదు. అథవా ఎవరన్నా కనపడితే, దంత వైద్యుడులాగ

బాధకలుగకుండా ఒకటో రెండో లాగడ మెలాగ, అని ఆలోచి స్తుంటే చల్లగా వాళ్ళు "సెలవండీ" అని జారిపోతారు.

'ఏమిటి నీ కింత అహంకారం' అంటావేమో. అహంకారం లేదు పల్లకాడూ లేదు. వ్యక్తికీ, దేశానికీ ఉండే సంబంధం, వారి Problems ఒకటేనని చెప్పబోయాను. సరే, ఈ గొడవకేమి. మన వ్యవహారం సర్వశూన్యంగా ఉన్నది. అప్పుడే పదకొండు కొట్టుతోంది గడియారం. బయట ఎండ మండి పోతోంది. అంతకంటే మండిపోతోంది కడుపులో. న్యాయానికి, అప్పటికప్పుడే అధమం మూడు సార్లైనా కాఫీతాగి వుండవలసినదిఅని ఏపత్రికాసంపాదకుడిని అడిగినాచెపుతాడు. ఈ ప్రొహిబిషన్ పెట్టిన పుణ్యాత్ములు కాఫీకికూడా పెట్టకూడదూ? అప్పుడు అయ్యరులంతా అఘోరిస్తారని ఊరుకున్నారనుకుంటాను. ఏమైతేనేమి బాధ మాబోటివాళ్ళకు. లేదంటే ఇబ్బందిలేదు. కాని, ప్రపంచములో ఇంత కాఫీ ఉండి తాగడానికి తాహతులేకపోతేమట్టుకు మహచెడ్డకష్టంగా ఉంటుంది. ఇంక కాఫీకే కానీ లేనప్పుడు బోజనానికెక్కడినుంచి వస్తుంది డబ్బు. మీ రెప్పుడేనా కనిపెట్టారో లేదో కాని, డబ్బులేనినాడూ ఉపవాసం ఉండదలచుకున్ననాడూ, తెల్లవారకముందు నుంచీ, ఆకలి దహించేస్తూ ఉంటుంది.

ఈ యెండవేళ వీధిని పడడమెందుకని ఇంట్లోనే కూచున్నా ఏదో ఆలోచిస్తూ. Plain living and high thinking లో నాకు చాల విశ్వాసం, నేను అంతకంటే ఇంకో మెట్టు పైకి వెళ్ళాను. No living and very high thinking నా సూత్రం. ఏమంటే, ఇహానికి బంధించి ఉంచే ధనసూత్రం లేనప్పుడు ఊహలెక్కువ స్వేచ్ఛగా అంతరిక్షాన్ని సంచరిస్తూ ఉంటాయి. ఊహల్ని పట్టగల

పగ్గాలేమున్నాయి! సాయంకాలానికి ఒక పావలా ఎవరి దగ్గర తడవడమా అనే ప్రస్తుతాన్నించి, ఈ వెర్రి ముండాకొడుకు, బ్రహ్మ కాస్త అవతలికి తప్పుకుంటే, సృష్టిలో ఎంత చక్కని మార్పులు తీసుకురావచ్చుననే విషయంవరకూ ఆలోచనలు పరుగెత్తసాగినాయి. అవన్నీ చెప్పాలంటే చాలకష్టం. అన్నీ జ్ఞాపకం కూడాలేవు. ఊరికే మాటవరసకు రెండో మూడో చెపుతాను.

సాయంకాలమేనా నాలుగు డబ్బులు ఎవరికి పన్ను వెయ్యడమా అని కాదూ ఆలోచిస్తూ పడుకున్నాను, ఆ విషయ మేమి తేలలేదు. కాని దానిపైన గవర్నమెంటు పన్నుల మీదికి పోయింది ఆలోచన; ఇన్ని రకాల పన్నులు వేస్తు న్నారు కొత్తవి. ఇంతకంటే సులువుగా డబ్బు వచ్చేవి అనేకం ఉన్నాయి. మన ప్రధానామాత్యులకు తగని అహంకారం కాని నాబోటివాడిని అడిగితే చెప్పుదును. మాటవరసకు చూడండి, వినోదాలమీద పన్ను Entertainment tax వేస్తున్నారా? అది ఒక్క సినీమాకో, నాటకానికో వెళ్లేవాళ్ళకు మాత్రం వర్తిస్తుంది. డబ్బు ఖర్చు లేకుండా చూచే వినో దాలు కొన్ని ఉన్నాయి. ఇప్పుడు, సాయంకాలం బీచికి కాని, పార్కుకు కాని వెళ్లితే అక్కడికి వచ్చే సౌందర్యవతులను చూడడానికి ఎంతమంది వస్తారో ఆలోచించండి. ఒక Marina కే, కార్లలో నెమ్మదిగా తిరుగుతూ ఆడవాళ్ల కార్లను వెంటాడిస్తూ లేక క్రిందనున్న వాళ్లను చూస్తూ వెళ్లే మహారాజులు మొదలు, పేవుమెంటు గట్టుమీద గుడ్లు వప్ప చెప్పి లొట్టలేస్తూ వెర్రిచూపుచూచే సామాన్య మానవులవరకూ ఉండే జనాభాను లెక్కపెడితే పది సినీమాలకు సరిపడ్డంత మంది కనపడతారు. వాళ్ళందరికీ తలో కానో అర్ధణో తగి

లిస్తే ఎంత రాబడో ఆలోచించండి. స్థూలకాయుల మీద ఒక పన్ను అంటిస్తే ఎలా ఉంటుందో ఆలోచించండి. మామూలు కొలతలు ఉన్నాయిగా. ఇంత పయస్సూ, ఇంత పొడుగూ ఉంటే న్యాయంగా ఇంత తూకం ఉంటారు అని ఒక ఇది ఉంది కాదూ. అంతకంటే ఎక్కువతూకం ఉన్నవాళ్ళకు పౌనుకు ఇంతని వేస్తే గవర్నమెంటుకు కావలసినంత డబ్బు. ఉస్మాను సాహెబుగారు, చెట్టినాడు కుమార రాజుగారు, ఇంకా ఇతర చెట్టియార్లు, షాహుకార్లు బోలెడంతమంది. ఇందులో తమాషా ఏమిటంటే స్థాల్యులంతా చాలావరకు ధనికులే. అందుచేత పన్ను వసూలు కావేమోనన్న భయం ఉండదు. పోనీ వాళ్లకు డబ్బు ఇచ్చుకోడం ఇష్టంలేనినాడు వొళ్లు తగ్గించుకోమనండి. చూచేవాళ్ళకంత బాధా ఉండదు. ఈ పన్ను విషయంలో మట్టుకు ఒక్క షరా ఉండాలి. ఆ పన్ను కవులను, కథకులను, పండితులను బాధించ కూడదు. లేకపోతే ముందు ప్రభాకరశాస్త్రిగారికీ, జొన్నలగడ్డ సత్యనారాయణ మూర్తిగారికి, యత్కించిత్తు నాకూ తగులు తుందేమోనని భయం. పట్నంలో ఎదురుగుండా రోజూ కన బడే వాళ్ళం మేము కాదూ మరి.

ఇంకొక షరా: ఈ పన్ను సినీమాతారల విషయంలో ద్విగుణీకరింపబడాలి. ఇంకా ఎక్కువ చేసినా చెయ్యవచ్చు. సుందరమ్మ, విశ్వేశ్వరమ్మ, కమల, సబిత, ఉమా, సులో చన, గోహర్, అబ్బో తప్పకుండా ఎక్కువ చెయ్యవలసినదే. ఇంకో విషయం. ఎవరన్నా పెద్దలు, మహానుభావులు, ఏ పనేనా చేస్తే జనసామాన్యం వాళ్ళను అనుకరించడం మామూలు. గాంధీగారి టోపీ, సర్వ జనాదరణీయమయింది.

ఆయన అంగవస్త్రం కట్టుకుంటే, సాంబమూర్తి, సత్యవీర భద్రం, గోవిందాచారి, వరదాచారి ప్రభృతులంతా కట్టారు; బాగుంది. ఇప్పుడు మన మంత్రివర్గమంతా ఒక రిద్దరు మినహాయించి, వారి పార్లమెంటరీ సెక్రటరీలతో సహా అంతా నిర్మీసులు. అనగా మీసం తీసివేపిసవారు. అదికాకుండా దేశ మంతా ఆదొక ఫేషనుగా అంగీకరించారు. అటువంటప్పుడు, ఇంకా మీసాలు పట్టుకువేళ్ళాడే వాళ్ళమీద పన్ను వెయ్యాలం టారా! అక్కర్లేదంటారా? మీసంకట్టుచోటల్లా ఆఖరుకు ఆడవాళ్ళకయినా సరే పన్ను వేసితీరవలసిందే. కోటిరెడ్డి, రంగయ్య నాయుడు, సీతారామమూర్తి చౌదరిప్రభృతులు దాన్నెంత తీవ్రంగా ఖండించినా తప్పకుండా పన్ను వెయ్య మని నా సలహా. షరా: ఈపన్ను మహమ్మదీయులకూ సిక్కు లకూ వర్తించదు. ఈ షరా లేకపోతే హమీద్‌ఖాను నిలవని వ్వడు. మీసాలమీద వాలినప్పుడు, గడ్డాలెందుకు విడిచి పెట్టాలికనుక! గడ్డాలమీదకూడా పన్ను వెయ్యవచ్చు.

దానికికూడా పైషరా వర్తిస్తుంది. అదిగాక ఇంకోషరా కూడా చేర్చాలి. తగినంతకారణం ఉండి మొక్కుబడికోసం గడ్డం పెంచుకోతలచినవాళ్ళు, స్వల్ప ఖర్చుపెట్టి, రాష్ట్రీయ కాంగ్రెసు సంఘంనుంచి ఒక పర్మిటు కొనుక్కోవచ్చు.

ఇంకా ఇలాటి పన్నులు ఎవళ్ళనీ అట్టే బాధించనివి అనే కం ఉన్నాయి. ఒక సంఘం ఏర్పాటుచేసి, ఇటువంటివింకా ఏమేమున్నాయో తెలుసుకుని తగినపన్నులు విధిస్తే రాష్ట్ర మంతా ఒక్కసారి ప్రొహిబిషను పెట్టవచ్చునని నా దృఢ విశ్వాసం. అన్నట్లు మరిచిపోయాను. పిలక జుట్టుమీదకూడా సైజువారిగా పన్ను విధిస్తే బాగుంటుంది. ఈ దెబ్బతో మన ప్రధానమంత్రిగారి పిలక ఉండడమో ఊడడమో తేలుతుంది.

ఊరికే అనాలోచితంగా పన్నులు వేశామంటే వేశామనికాదు; దానివల్ల తగిన ప్రయోజనంకూడా ఉండాలి. ఆ డబ్బుతో ప్రజలకు ఆనందమును కలిగించాలి. రాజాజీకి వ్రాయాలనుకుంటున్నాను. పిలకజుట్లువారు, వామనులు, స్థాల్యులు, బృహత్పతులు, వగైరా సూట్లువేసుకుంటే శిక్ష విధించవలసినదని; అథవా, వారు సూట్లువేసుకున్నా కోట్లు పొట్టిగా కుట్టించిన వాళ్ళమీద, ఇంకొంచెము శిక్ష ఎక్కువగా ఉండాలి. అటువంటి అందవికారం శిక్షార్హంగా విధించినందుకు సౌందర్యోపాసకులు ఎంత సంతోషిస్తారో ఆలోచించండి. క్రమేణా దేశం పూర్వంవలె సౌందర్యవంతం అవుతుంది. అలాగే సాయంకాలం చల్లగాలికి విలాసార్థము బీచికివచ్చేవారు సూట్లూ తలగుడ్డలతోటీ రాకుండా చేయాలి. ముఖ్యంగా చక్కని చీరలు కట్టుకున్న ఆడవాళ్ళతో వచ్చినప్పుడు సూటు సుతరామూ ఉండకుండా చెయ్యాలి.

అలాగే ఆడవాళ్ళు క్రైస్తవులైనాసరే, చీరకట్టవలసినదేకాని దొరసానుల పద్ధతిని వేషం వెయ్యనివ్వ కూడదు. ఆఖరుకు Fancy dress లో కూడా పనికిరావు. ఆపైన జుట్టుకత్తిరింపులొకటి మానిపించెయ్యాలి. నల్లనివాళ్ళను, ముఖాలపైన బుక్కా చల్లుకోనివ్వకూడదు. ఎర్రనివాళ్ళు పెదవులకూ బుగ్గలకు ఎక్కువరంగు వాడకూడదు. ఏమైనా సరే, ఎవరికి కోపమొచ్చినా సరే కాని హైందవస్త్రీల సౌందర్యమును కాపాడడము విషయంలో తగినంత శ్రద్ధ వహించక తప్పదు. దేశం యొక్క అధిక్యత, ప్రత్యేకత, ఔన్నత్యం, గౌరవం,ఇత్యాదులు మన వేషభాషలవల్లా, సాహిత్యాది కళలవల్లనేకదా ఇతరులు తెలుసుకునేది. ఇంతవరకూ మన మర్యాదా, ఆచారములూ ప్రత్యేకతా నిలిపినవారు మనస్త్రీలు కదా? ఇప్పుడు

వారుకూడా, అర్థంలేని అనుకరణలు ప్రారంభిస్తే ఇంకేనే ముంది? ఈ సందర్భంలో ఇంకోమాటకూడాను. దేశభాషల కోసంతంటాలు పడే ఈరోజుల్లో మొగాళ్ళే సాధ్యమైనంతవరకు ఇంగ్లీషు మాట్లాడడం మానుకుంటున్నారు. అలాటప్పుడు, ఆడవాళ్ళు బయలుదేరి అయినదానికి కానిదానికి ఆంగ్లంలో మాట్లాడుతోండడం చాలా హాస్యాస్పదంగావుంది. ఎప్పటికన్నా వాళ్ళంతా హిందీ మాట్లాడినా ఒప్పుకోవచ్చు కాని ఇంగ్లీషు మాట్లాడితే మట్టుకు కష్టంగానే ఉంది. కొందరు కొంపరు మాట్లాడుతోంటే ముద్దుగా ఉన్నమాట వాస్తవమే. కాని, దేశంకోసం, స్వంత అభిరుచులూ అభిమానాలు చంపుకో తలుచుకున్నాను. ఇలాగే, బోలెడన్ని ఉన్నాయి చేయవలసిన పనులూతేవలసిన మార్పులూను. ఆడవాళ్లు ప్రశంస ఎత్తుతే నాకు వొళ్లుతెలియదు. అందుచేత ఆ విషయం సావకాశంగా పుస్తక రూపకంగా వ్రాసి రాజాజీకి పంపించాలి. మనిషికి కాని దేశానికి కాని డబ్బుంటూ ఉంటే ఎంతేనా చెయ్యవచ్చును. ఎన్ని మార్పులేనా తీసుకు రావచ్చును. విద్యావిషయం, సంఘసంస్కరణం, నిరుద్యోగనివారణ, దారిద్ర్య నిర్మూలనం, ఇత్యాదులు చాలాస్వల్ప విషయాలు. ఇటువంటివి ఏ రాజాజీ చేసినా చెయ్యగలడు. నాదాకా అక్కరలేదనుకుంటూ, ఇంకా ఏవేవో ఆలోచిస్తూ పడుకున్నాను. ఒక కునుకుతీసి ఉంటాను కూడాను. నాలుగుగంటల ఫిరంగి వినపడి, విపరీతమైన తలనొప్పితోనూ ఆకలితోను లేచాను. బయటకువెళ్లి సాయం కాలానికైనా భోజనం సంగతి ఆలోచిద్దామనుకుంటూ ఉంటే, ఒక ఆలోచన తట్టింది. ఈ విషయం అంతా తమాషాగా కథ లాగ వ్రాసి, ఏ ఢంకాలోనో వేయిస్తే, ఒకటో రెండో రాలవా అనుకున్నాను. వెంటనే నాలుగు ముక్కలువ్రాసి, కాగితాలు

జేబులో పెట్టుకుని వీధులోకిరాగానే పోనీ, ఆంధ్ర పత్రిక వారు
ఏమన్నా ఎక్కువ ఇస్తారేమో చూదామని అక్కడకు వెళ్లాను.
శంభుప్రసాద్ గారు నన్ను చూడ్డంతోనే "ఏమండీ, ఇంకా
బాగున్నారా ?" అన్నారు. కొంచెము కాళ్లు చల్లపడి "చిత్తం"
అని తరువాయి సంగతి చెపుదామనుకుంటుంటే నాకు అవ
కాశం ఇవ్వకుండానే "పంతులుగారు, పోయారు. మీకు తెలు
సుగా. ఆయన పద్ధతులు కొన్ని మార్చేశాము;"అన్నారు గంభీ
రంగా. "చిత్తం తమరు మారుస్తారని నాకు తెలుసు. అయినా
ఊరికే దర్శనం చేదామని వచ్చాను" అన్నాను. 'సరే, చేశా
రుగా' అన్నాడు, సదురూ బెదురూ లేకుండాను. కుర్రాళ్లకే
ముంది, పెద్దా పిన్నా మంచీ చెడ్డా ఏమన్నా ఉంది కనుకనా?
పోనీ, వారపత్రికలకు, ఏ నవశక్తికైనా ప్రజాబంధులాంటి
దానికేనా ఇద్దామా అంటే, వారు సోపలిష్టులు, పుచ్చుకోడమే
కాని, ఇచ్చేమర్యాద అట్టే ఉన్నట్టు కనుపించదు. అయినా
ఢంకాయే మ్రోగించి చూదామని అక్కడికీ వెళ్ళాను. సంపాద
కుడు అప్పుడే బయటకు వస్తున్నాడు, 'ఏమండీ రండి, కాఫీ
తీసుకుందా మన్నాడు'. బ్రతుకు జీవుడా అని ఆయనవెంట
పడ్డాను. 'ఏమండీ స్టోరీ ఏ మన్నా వుంటే ఇవ్వకూడదా
మాకు' అన్నాడు ఆయన. 'ఉన్నదండీ ఒకటి, Radio లో
చదవనిస్తారేమో, ఏదో పదిరాళ్లు దొరుకుతాయనుకుంటు
న్నాను' అన్నాను. "మీరు చాలా అమాయకులండి. అక్కడ
ఛాన్సు తరుచు పత్రికా సంపాదకులకూ, పార్లమెంటరీ సెక్ర
టరీలకూ దొరకినట్లు మీ బోటి వాళ్లకు దొరకదండిసార్'
అన్నాడు ఆయన నవ్వుతూ. ఇంక ఆ బాధ మనకెందుకని
జేబులో కాగితాలుతీసి ఆయనకిచ్చాను. "Thank you-
sir ఎప్పుడేనా మా ఆఫీసుకొచ్చి కాస్త కాఫీ పుచ్చుకు పోతేం

డండి సార్. మమ్మల్ని మరచిపోకండి. శలవు'' అని నిమ్మళంగా దాటాడాయన.

నెమ్మదిగా టోపీవేసి ఈయన కథలాగేశాడే, మన Problem ఏమి solve కాలేదు. మనంకూడా నాగేశ్వరరావు పంతులులాగ ఏ అంజనమో తయారు చేదామని నిశ్చయం చేసుకొని బసకు చేరుకున్నాను. పర్యవసానం మరొకప్పుడు మనవి చేస్తా.

నాకు పెళ్లిఅంటే మహ చెడ్డసరదా. సరదాలోనూ కాస్తా కూస్తా కాదు. అందులో మొగపెళ్లివారితో తరలివెళ్లడ మంటే ఇక వేరే చెప్పనక్కరలేదు. విశేషించి ఇంటి అల్లుణ్ణి; అందులో పెద్దఅల్లుణ్ణి అయితే ఇంక అడిగారూ? ఏ అల్లుడైనా అడపెళ్లి అంటే కొంచెం చిక్కే మొత్తముమీద. ఇంటిల్లు పాదీ, అడవాళ్ళూ మొగవాళ్ళూ కూడా అటూ యిటూ ఏదో పనులున్నట్టుగా పరుగెత్తుతూ కేకలువేస్తూఉంటే అల్లుడికి మట్టుకు కూర్చోబుద్ధి పుట్టుతుందా? నాబోటివాడు చూసీ చూడనట్టుగా పరధ్యానంగా కుర్చీలో ఏమీ కలుగజేసుకో కుండా పడుకున్నా, మామగారు ఏ పనికోసరమో కుర్చీలో వున్న మనిషిని కేకవేసి అర్ధనిమీలితనేత్రుడై ఇంత హడావిడి లోనూ, నిర్వికల్ప సమాధిలోనున్న మహామహుడు అల్లుడని తెలిసికొని మాట్లాడకుండా చక్కాపోయినా, వాళ్ళపుట్టిఅంతా మునిగిపోయినట్లు పైవాళ్ళు మట్టుకు ఊరుకోరు. ఎందుకో అందుకు అస్తమానమూ 'సత్యం,ఇలారా' అనీ ఒకరూ,'బావా, ఒకమాటు వంట పందిట్లో'అని ఒకడూ,'అన్నగారూ, పందిట్లో యులాయి బుడ్డీ సంగతి చూడండి.'అని ఒకర్తూ, 'ఏమోయ్ మామా' యిలా కూచ్చుంటే ఏలాగు, బోగము మేళము ఇంకా రాలేదు.' అని ఒకరూ - ఇలాగు ప్రాణాలు తీసివేస్తారు. వాళ్లంతా వీధిలోనుంచి దొడ్లోకి, దొడ్లోనుంచి వీధిలోకీ పరుగె త్తడమేకాని చేసేపనేమీ కనబడదు. ఒకటి రెండుసార్లు చూసి వీళ్ళతోటి బాధ పడలేక వాళ్ళకంటే ఎక్కువ తొందరగా ఎక్క డికో అక్కడికి పిలుపుకు అందకుండా పరుగెత్తుతుండేవాణ్ణి. ప్రస్తుతం అబాధఏమీ లేదు—మొగపెళ్లి గనుక.

తెల్లవారితే స్నాతకము. బంధువులంతా వచ్చారు. అనగా ముఖ్యు లొకరిద్దరుతప్ప. కావలసిన సామానులన్నీ, బాణా

నంచానసహా, వచ్చినాయి. మర్నాడు ప్రయాణానికి సామాను సర్దుకోవడముతో పడుకునేటప్పటికి రాత్రి రెండు గంటలయి నది. ఈ ప్రయాణమెలాగో, అక్కడికి ఏలా చేరుతామో అను కుంటూ కన్నుమూసే నరికి పాతికమంది చంటిపిల్లలు రాగాలు పెట్టడము మొదలుపెట్టారు. నిజానికి ఇంట్లో ఇంత మంది చంటిపిల్ల లున్నారని నేనెరుగను. తెలిస్తే అక్కడ పడుకోక పొయ్యేవాడిన్ని. పడుకోవడమేమిటి, అసలు పెళ్ళికే వెళ్ళకపొయ్యేవాణ్ణి. అపూట వచ్చిన జనాభాను లెక్క చూడడ ములో ఏ డెనమండుగురు కంటె పిల్లలతల్లు లున్నట్టు తోచ లేదు. దాన్నిబట్టి ఏడెనమండుగురుకంటె చంటిపిల్ల లుంవరు కదా—పోనీ యిందులో కొంతమందికి కవలపిల్లలున్నా మొత్తముమీద డజను కంటె ఎక్కువ ఉండరుకదా అను కున్నాను. వాస్తవానికి అంతకటె ఎక్కువమంది లేకపోయి ఉండవచ్చును. కాని ఇంతమంది ఏకగ్రీవముగా ఒక్కసారే తమ అభిప్రాయాన్ని తెలియపరచేసరికి కొంచెము బాధగానే ఉన్నది. రాత్రి తెల్లవార్లూ నిద్రలేక తెల్లవారురఝామున మూడు గంటలకు కన్నుమూసినప్పుడు కోకిల కూసినా దాన్ని మంద లించ బుద్ధి వేస్తుంది. ఇలాంటి సందర్భంలో చంటిపిల్లల కంఠాలు—అందులో అన్నికంఠాలూ, కేవలమూ కోవెలస్వరా లని చెప్పడానికి వీలుండదుకదా! ఏలాగైతేనేమి? వాళ్ళనం దరినీ సముదాయించి వాళ్ళ తల్లులు పడుకోబెట్టేసరికి నాలుగు గంటలలు కావచ్చినది.

మళ్ళీ ఎలాగో కన్ను మూశాను. పొరుగూరినుంచి కుదిర్చిన బాకావాడు నాపాలిటి యముడులాగ అప్పుడే వచ్చాడు. పోనీ వచ్చినవాడు — వాడూ ఒకరాత్రి వేళను బయలుదేరి ఉండవలెనుగదా - నిద్ర లేకుండా నడిచివచ్చి

నాడా - కాస్సేపు పడుకోకూడదూ! ఇంకా ముందు అయిదు రోజులు వుండనే ఉన్నదాయెను! అమ్మో, వాడెందుకు పడుకుంటాడు? నాలుగునందల పరకాళాతాన్లు ఒక్కమాటు చించినట్లు బ్రుస బాకా పట్టాడు. తేలుకుట్టినట్టుగా లేచాను. దురుద్దేశము కలిగింది చెప్పవద్దూ. వాన్ని నిలువునా చీల్చివేదా మనుకున్నాను. కాని తీరా ఇంతపెళ్ళి ఆగిపోతుంది; ఇంతమందికీ ఉత్సాహభంగము అవుతుంది;—అనుకొని శాంతించాను. బడాయి కాదుకాని, ఆ సమయంలో నేను గనకనే ఆగాను, మరొకడయితే తెల్లవారేసరికి రాజమండ్రి జయిల్లో ఉండేవాడే. సరే, వాడూ మానేటప్పటికి భజంత్రీలు వచ్చారు. ఇంతట్లోకే తెల్లవారింది. తేనెపట్టులో ఈగలులాగ ఇంట్లో అందరూ కిలకిలలాడుతూ లేచారు. కావడము ఆరోజూ అన్ని రోజుల్లాంటిదే అయినా నామట్టుకు సూర్యుడేదో కొత్తతేజస్సుతో ఉదయిస్తూన్నట్టూ, ప్రభాత వాయువులలో కొత్త సౌరభము ఉన్నట్టూ, ప్రలముఖాల్లో వింతసొగసున్నట్టూ తోచింది.

దంతధావన మయ్యేసరికి చంటిపిల్లలమీదా, బాకావాడిమీదా, భజంత్రీవాళ్లమీదా వచ్చిన కోపము కొంచెము చల్లారింది. ప్రొద్దున కాఫీ ఇచ్చేవాళ్ళు ఎవళ్ళూలేక, ఆకలి పట్టలేక, స్నానికానికి తెచ్చిన అరటిపళ్ళు నాలుగు కుర్రవాళ్ళు ఎవళ్ళూ చూడకుండా నోట్లో చడీచప్పుడూ కాకుండగా వేసుకున్నాను. ఇంతట్లోకే మా మామగారువచ్చి 'ఏమి నాయనా, ఇవ్వాళ కాఫీకూడా లేదుకాబోలు - భోజనాలు ఆలస్యమవుతవి. కాసిని పాలు పుచ్చుకుంటావా ఏమిటి' అన్నారు. 'ఆఁ, ఎందుకులెండి. ఎంత పొద్దుపోత వేమిటి భోజనాలు, అయితేమట్టుకు మునిగిపోయిం దేమిటి'

అన్నాను. అరటిపండ్ల సంగతి ఆయనకేమి తెలుసును? 'అలా కాదు, కాసిఖిపాలు పుచ్చుకుంటేనేకాని వల్లకా'దని, చంటి పిల్లలకోనరము తెప్పించి పొయ్యిమీదపెట్టిన ఆవుపాలు కాసినీ ఎవరితోటీ చెప్పకుండా ఆపుకోరాలో వంచుకొని కాస్త పంచ దారపేసి మామగారు స్వయంగా నా ముందు పెట్టారు. పుచ్చుకోకపోతే ఆయనకేమి కోపం వస్తుందోననుకొని రెండు గుక్కలలో ఆపుకోరాషు పాలూ తాగివేశాను.

ఇంతట్లోకే యింట్లో ఆడవాళ్ళలో కంగారు బయలుతేరింది. ఏమిటని విచారించగా, పొయ్యిమిద కాగుతూన్న ఆవుపాలు ఏ పిల్లో తాగివేసినది; ఇక చంటీపిల్లలగతి ఏలా'గని కంగారు పడుతున్నారు. మా మామగారు వెళ్ళి, 'అవి ఆవుపాలా! గేదెపాలు అనుకున్నాను. వెధవపనులూ, వెధవ తెలివితేట లూనూ, ఎవ్వరితోనూ చెప్పనక్కరలేదా! చెప్పకపోతే ఎలా తెలుస్తుంది నాకు? చంటిపిల్లలు ఆలా గోలపెడుతున్నారు. మళ్లీ పాలు ఎప్పటికి రాను, ఎప్పటికి కాగను; ఎన్నియేళ్ళు వచ్చినా తెలివితేటలు ఒక్కమాదిరిగానేతగలబడుతున్నాయి.' అని ఇంటిల్లిపాదిమీదా ఇంటికప్పెగిరి పొయ్యేటట్టు కేకలు వేశారు. మా ఆవిడ ఏదో మాట్లాడబోతూంటే 'నీవేమీ మాట్లాడ వద్దు' అని సంజ్ఞచేసి నేను నిమ్మళంగా అవతలకి దాటాను. ఆమె తెలివి అయినది గనుక గ్రహించుకొని 'సరే, నాన్నా, యిప్పుడు కేకలు ఎందుకు? అయిందేదో అయిపోయింది. ఆలస్యమవుతే పాలు ఇంకఎక్కడా దొరకవు కూడాను, ముందు ఎక్కడకయినా పాలకు పంపించు' అని తండ్రి చేతికి తప్పేలా అందించింది. ఆయన పాపము కోపము అంతా మరిచిపోయి మళ్లీ పాల ప్రయత్నముమీద వెళ్ళిపోయి నారు.

నే నీ హడావుడి అణిగేదాకా కొంచెము అటూ యిటూ తిరిగి కుర్చీలో కూర్చొని కాస్సేపు నిద్రపోదామని కన్ను మూశాను. మా పెద్దబావమరిది ఒక్క పరుగున వచ్చి నన్ను లేపి, "బావా వచ్చారోయ్'' అన్నాడు. కళ్ళు మూసుకునే, 'ఆఁహాఁ, వచ్చారా; సంతోషము, జాగ్రత్తగా వచ్చారా? సామానులు లోపల పెట్టించి పిల్లలకు పాలూగీలూ కావలెనేమో చూడు.కొంచెము తల నొప్పిగా ఉండి పడుకున్నాను'అన్నాను. "పిల్లలేమిటి ? పాలేమిటి ?'' అన్నాడు "ఆ ప్రశ్నఏమిటి నీ మొహము పిల్లలకు అవుపాలు కావలెనేమోకనుక్కో''అన్నాను "ఎవరిపిల్లలకు'' అన్నాడు. "ఇప్పుడు ఎవరు వచ్చారు సూరమ్మా పిల్లలూ కాదా" అన్నాను. వాడు పకాలుననవ్వి, "కాదోయ్, బోగముమేళము" అన్నాడు. "ఏడిసినట్టే ఉంది తెలివితేటలు; వాళ్లకోసము నేను బెంగ పెట్టుకొన్నాననే నిద్ర పోతూన్నవాణ్ణి లేపావా ? సరే ఇంకనేమి, నీకు చేతినిండా కావలిసినంత పని. వెళ్లిపాపము, వాళ్ల సప్లయిసంగతి చూడు'' అన్నాను. ఇంకనిద్రఏలాగూ వీళ్లు పోనివ్వరు అని ఆవొచ్చినమొహాలు ఏలాంటివో చూతామని నేనూ వీధిలోనికి వచ్చాను. ఎంత ఏంటీనాచ్ అయినా కళ్లముందునుంచి వాళ్లు వెడుతూంటే తల వంచుకునేనా వాళ్లకేసి చూడ బుద్ధి అవుతుంది. తల వంచుకుని క్రీగంట చూస్తే వాళ్లకు సైగచేస్తున్నా ననుకుంటారేమో అని నేను ఎప్పుడూ బాహాటంగా తల ఎత్తే చూస్తాను. అది కాకుండా బ్యూటీ ఎక్కడున్నా సౌందర్య పిపాస కలవారు చూచి ఆనందించక మానరుకదా ! ఊళ్లో సగముమందిజనము బండ్లచుట్టూ నిలవబడి బండ్లవాళ్లను సామాను జాగ్రత్తగాదింపమనీ, బోగమువాళ్లని జాగ్రత్తగా దిగమనీ హెచ్చరించడము మొదలుపెట్టారు. పాపము వాళ్లు

ఎక్కడికివెళ్లినా, ఏలోటూ లేకుండా అలా యోగక్షేమము కనుక్కొని ఊరిలో అశేషజనమూ సప్లయిలు చేస్తూంటారు కనుకనే వాళ్లు నెగ్గుకుని వస్తూంటారు ఆరాత్రి ఊరిలోనుంచి పెళ్లివారు బయలుదేరి వెళ్లేవరకూ గ్రామస్థులయిన యువకు లకు యీసప్లయితోటి భోజనానికేనా ఎక్కడా తీరిక లేకపో యింది. బండీలోనుంచిదిగిన రెండుమొహాలుచూశాను. మూడో మనిషి దిగుతూంటే ఇకనక్కడ నిలబడలేకపోయాను. అనిత్య సువాసినుల సౌందర్యము చూస్తూంటే వళ్ళు గరిపొడిచింది. ఏదో పదివూళ్ళు తిరిగేవాణ్ణి, అనేకరకాల ముఖాలు చూసే వాణ్ణి నాకే హడలుపుడితే యింక ఆడవాళ్లూ, పిల్లలూ చూస్తే వా ళ్లేమవుతారా అనిపించింది. ఏది ఏలావున్నా మనవాళ్ళు మేజువాణీ పెట్టించక మానరు. వాళ్ళు ఆడుతున్నప్పుడు ఆడ వాళ్ళు పిల్లలను ఒడిలోపెట్టుకొని చూడకమానరు. పిల్లలు వీళ్లని చూసి జడుసుకోకమానరు. అందుకని పిల్లలమట్టు కయినా ఇంద్రాక్షివిభూతి చెప్పడానికి ఒకబ్రాహ్మణ్ణి తీసుకు వస్తేనేకాని వల్లకాదని మామగారితోటి దెబ్బలాడాను. ఆయ నెంతసేపూ వేళాకోళ మనుకున్నాడు గాని నాబోస్లేAnxiety అంటే నాకంఠములో ఆదుర్దా కనిపెట్టలేక పోయాడు

ఇంతట్లోకే ఎదట వర్ష మొస్తూన్నది; స్నాతకానికి పీటల మీద కూర్చోవాలి; లేవండి అంటే లేవండిఅన్నారు. ఊళ్లో నలుగురినీ కేకవేసుకొని రమ్మని మామగారు నాకూ, ఆయన పెద్దకుమారుడికీ పురమాయించారు. మేమిద్దరమూ, మావెన కాల పదిపదిహేనుగురు ఆడవాళ్లూ బయలుదేడ నిముష ములో అందరినీ పిలుచుకొని చక్కావచ్చాము. మేము వచ్చే టప్పటికి అప్పటికే ఒకపక్కని మేజువాణీ జరుగుతూఉన్నది. మేము ఏలాగూ పిలుస్తా మనేధైర్యముతోటి ఊళ్లో కుర్రకారు

అంతా బోగమువాళ్లదగ్గర సభతీర్చారు. ఎదురుగుండా స్నాతకము జరుగుతున్నది. పురోహితుడికి కొంచెము వయస్సు మళ్లినా, దృష్టిఅంతా మేజువాణీమీదనే ఉన్నది. ఏ మేజువాణీచూస్తూన్నా డబ్బులదగ్గిరమట్టుకు ఎప్పుడూ ఏమీ మరిచిపోలేదు.

సరే, పెండ్లికొడుకునకు కర్రా, చెప్పులూ, చెంబూ, గొడుగూ, మొదలయినపరికరాలు అన్నీ యిచ్చి ఒకమారు కాశీవెళ్లి రెండునిమిషాలలో మళ్లీ వర్జము తగలకుండా తిరిగి రమ్మన్నారు. రెండడుగులు వెళ్లగానే బావమరది వరసవాళ్లంతా "సరేవెళ్లనివ్వండి ఎక్కడీకి వెడతాడో, పిలవకండి; ఏమిచేస్తాడో చూతాము" అని మామూలు 'విట్లు' వేశారు. ఏమో ఒకవేళ నిజంగా చక్కాపోతాడేమో కొంపతీసి అని మేనమామ జెమూరూ, బెల్లముముక్కా తీసుకువెళ్లి, "రా, నాయనా, వెళ్లకు. మా పిల్లనిచ్చి పెళ్లీచేస్తాము!" అన్లి బ్రతిమాలి తీసుకువచ్చాడు. పెళ్లికొడుకు అల్పసంతోషి. లేకపోతే మేనమామ ఇచ్చిన రెండురూపాయల జామారుకు చప్పున కక్కుర్తిపడి వెనకకు రాకపొయ్యేవాడే! పయిగా మాటవరునకు అన్నాడేకాని ఇప్పుడు మావాడికి ఇవ్వబోయేపిల్ల మేనమామకూతురు కాదు. మరొకళ్ళయితే అమాంతంమీద నిలబెట్టి నీకూతురినిచ్చి పెండ్లిచేస్తావా చెయ్యవా అని నిఖాచేసి ఉండేవాళ్లే. ఇక నేమైతే నేమి, పెళ్లికొడుకు అంత కాశీప్రయాణమూ మానుకొని పిల్లనిస్తాననేనరికి మాట్లాడకుండా వెనుకకు చక్కావచ్చాడు. వెర్రివాడు అనండి, అమాయకుడనండి - పెద్దమనిషనండి - అంతా ఒకటే.

స్నాతకము పూర్తిఅయినది. ఆడబడుచులు మంగళహారతులు తీసుకుని చక్కావచ్చారు. "సరే కానివ్వండి

అమ్మా, త్వరగా, మంగళహారతి ఇచ్చివేసెయ్యండి. మన కింకా బోలెడంతపని ఉన్నది'' అన్నారు మా మామగారు. ''సరే మాఅభ్యంతర మేమీ లేదు; పళ్లెములో పడేదేమిటో వేస్తేనేగాని మంగళహారతి యివ్వడమేలాగు'' అన్నారు. ''ఏలాగేమిటి, మంగళహారతి రూపాయలతోటి యివ్వరుకదా- చేత్తోటికాని- ఇస్తాలెండి- ఏదో ఒకటి తరవాత, కానివ్వండి'' అన్నారు.

''తరువాత నెందుకు లెండి. ముందు రూపాయలు అందులో పడితేనేకాని మాచేతులు ముందుకు రావు'' అన్నారు. రోజులు అలాంటివి: డబ్బుదగ్గిరికి వచ్చేసరికి తండ్రిమాటయినా నమ్మరు. అంతా కోమటిబేరములోకి దిగింది. డబ్బిస్తేనేకాని ఆడపడుచులు మంగళహారతి ఇవ్వరు; డబ్బిస్తేనేకాని బ్రాహ్మణులు ఆశీర్వదించరు; డబ్బిస్తేనేగాని పురోహితుడు పెళ్లి చేయించడు; కట్నమిస్తేనేకాని పెళ్లికొడుకు దొరకడు; వస్తువులు పెడితేనేకాని పెళ్లికూతురు వప్పుకోదు. ఏలాగయితేనేమి పదినిమిషాలు ఘర్షణపడి రూపాయలు పళ్లెములో ఘల్లుమనగానే నాలుగుపాటలుపాడి మంగళహారతులిచ్చారు. గమ్మత్తేమిటోకాని మామూలుగా మనవాళ్లకంఠాలెంతఅసహ్యముగా ఉన్నా, యిటువంటిసమయాలలో వాళ్ళు నలుగురూ కలిసి పాడుతూఉంటే నాకది ఒకవిధమయిన ఆనందముగానే ఉంటుంది. అవతల భోగమువాళ్ళుమట్టుకు వీళ్ల కంఠాలూ, పాటలూ విని నవ్వుకుంటూనేవున్నారు.

సభవారికీ ఇష్టము లేకపోయినా మేజువాణీ అప్పటికి కట్టిపెట్టించి తాంబూలాలు ఇచ్చి అందరినీ పంపివేసి భోజన ప్రయత్నాలు చేశాము. ఏవో రెండుమెతుకులు నోట్లో వేసుకొని ఇవతల పడేసరికి సుమారు మూడుగంట లయినది.

ఇక నక్కడుంటే వాళ్లపనికి అడ్డుగా ఉంటుందని నేను ఇంకొక స్నేహితుల ఇంటికివెళ్లి పడుకున్నాను.

దీపాలు పెట్టేసరికి లేచి కొంచెము దూరము షికారువెళ్లి నెమ్మదిగా ఇంటివైపు మళ్లాను. ఆకాశము నిర్మలముగా ఉన్నది. వెన్నెల చక్కగా ఉన్నది. గాలి కొంచెము చల్లగా వీస్తూన్నది. ప్రయాణమునకు చాలా అనుకూలముగా ఉన్న దని సంతోషించాను. మావీధిలోకి వచ్చేసరికి బళ్లలో సామా నులు సర్దుతున్నారు. ఒక్కమాటు అన్నిబళ్లకేసీ చూసి బళ్ల వాళ్లను త్వరగా సర్దమని ఒకకేక వేసి సాయంకాలమునుంచీ యీపనిమీదనే ఉన్నట్లు హడావిడిగా ఇంట్లోకి వెళ్లాను. ఆలా డాబుచేస్తూ ఏదో నిరవాకము చేస్తున్నట్టు నటిస్తేనేకాని మాట దక్కదు. బంట్రోతుమొదలు గవర్నరువరకూ రాజ్యభార మంతా తమరే మోస్తున్నట్టూ, చక్రవర్తి శ్రేయస్సు కోరేవారు తమరుతప్ప మరొకరు లేనట్టూ నటిస్తారు. ఖద్దరుబట్టలమ్మే గుమస్తామొదలు దేశబాంధవులవరకూ ఉన్న అన్నిరకాల వారూ తమంత దేశభక్తులూ త్యాగులూ మరొకరు లేనట్టు నటిస్తారు. ఒళ్లంతా విభూతిపూసుకొని వీధులలో తిరిగేబైరాగి మొదలు మహర్షి బిరుదాంకితులవరకూ ప్రతీవాళ్లూ తమంత భక్తులూ, విరాగులూ, పరమేశ్వరున కాప్తులూ మరొకరు లేనట్టు నటిస్తారు. ఏమిచెయ్యము?

లోపల ఆడవాళ్లు యింకా పెట్టెలు సవరిస్తున్నారు. మా ఆవిడా పెట్టెదగ్గర కూచుని పెట్టెలోబట్టలు ఇవతల పారవేసి, బయటనున్నవి పెట్టెలో పడవేసి, అన్నీకలిపి ఒకమాటు ఇవతలకుతీసి, మళ్లీ అన్నీకలిపి పెట్టెలో పెట్టింది. ఇంతా చేస్తే పెట్టెలో ఏ బట్టలు పడ్డవో, ఏబట్టలు పడలేదో జ్ఞాపకము లేకపోయింది. అందుకని తనవెనకాల కూచుని ప్రపంచ

మంతా మరచి బొమ్మకి తలంటి నీళ్ళుపోసుకుంటూన్న కూతురిని అల్లరిచేస్తున్నదనే మిషతోటి ఒక్కటి తగల్చిచ్చి మళ్లీపెట్టెలో బట్టలు ఒకటొకటే తియ్యడము మొదలుపెట్టింది.

నేను తిన్నగా మాఆవిడదగ్గరకు వెళ్లి ఇంటిల్లపాదీ హడిలి పోయేటట్లు "ఇంకా ఎంతసేపు యీసర్దడము, తెమలడ మంటూ వుండదు ఏవేళకూను. పెందరాళే రెండుమెతుకులు నోట్లో వేసుకుని బయలుదేరుతేనేకాని రేపు చాలా ఇబ్బంది పడవలసి వుంటుందనే జ్ఞానము ఒక్కళ్లకూ లేదు. ఎప్పుడూ నీపను లింతేను. ఆడవాళ్లతోటి ప్రయాణము పెట్టుకోవడము బుద్ధితక్కువ. ఈమాత్రము సర్దుకోలేనివాళ్లు నోరు మూసుకొని ఇంటిదగ్గర కూర్చోక, 'తగుదునమ్మా' అని ఎక్కడికి పడితే అక్కడికి తయారు. కానియ్యవేమి యింకాను? హాత్ హూత్" అని పెద్దపెద్ద కేకలు వేశాను. ఇదంతాచూసి పక్కనున్న మాపిల్ల వాళ్లతల్లిని కొడతానేమోనని భయపడి తల్లిని కౌగ లించుకొని రాగాలుపెట్టడం మొదలుపెట్టింది. నా అసలు ఉద్దేశము మాఆవిడను కోపపడదామని కాదు. దాన్ని కోప పడడమంటే నామనస్సు ఒప్పుకోదు. మాఆవిడ చాలాబుద్ధి మంతురాలూ, నెమ్మదైనదీ, తెలివితేటలైనదీ అని నానమ్మ కము. ఇప్పుడూరికే తక్కినఆడవాళ్లందరికీ బుద్ధిచెబుదామని మా ఆవిడమీద వంకబెట్టి కేకలువేశాను. అది ఆరహస్యము కనిపెట్టినట్టు కనుపించదు. అనక బండిలో ఒంటిగా వున్న ప్పుడు చెప్పి సముదాయిద్దా మనుకున్నాను. అదిగాక వాళ్ళ పుట్టినింటే, వాళ్లవాళ్ళఎదటే ఒక్కసారి ఇలా డబాయిస్తే నాభార్యమీద నాకుండే సంపూర్ణస్వాతంత్ర్యము తెలుపవచ్చు ననీ, నాభార్య చాలా బుద్ధిమంతురాలు, అయిన ఇన్నికేకలు వేసినా మారు మాటాడలేదని తక్కినఆడవాళ్ళంతా సంతోషిస్తా

రనీ నాఅభిప్రాయమే కాని, మాఆవిడ ఎదురుతిరుగుతేమట్టుకు కొంప మునిగిపోయేది. ఏదో నాఅదృష్టము బాగుంది. అలాంటి ప్రమాదమేమీ జరుగలేదు.

నా కేకలూ వృథాగా పోలేదు. ఆడవాళ్లందరూ గబగబా సామాను సర్దుకొని పెట్టెలు ఇవతల పడవేశారు. బళ్లవాళ్ళు తీసుకువెళ్లి బళ్ళల్లోపారవేశారు. తీరా చూసేసరికి సగము బళ్ళు సామానుతోనే నిండిపోయినాయి. ఇంతసామాను ఎందుకర్రా అంటే వినరు. ఏవో నాలుగుబట్టలు తీసుకుంటే చులాగ్గా వెళ్ళిరావచ్చునా - అలా వప్పుగోరుగా! ట్రంకుపెట్టెలు, రంగూనుపెట్టెలు, మోర్మెనుపెట్టెలు—ఎందుకు ఇవన్నీనీ ? మనలో ఉండేదే అది: ఊరికే అనవసరమైన బలువంతా నెత్తిని పెట్టుకోవడము. జీవితములోకూడా అంతే. లేనిపోని బాదరబందీలు, అయినవీ కానివీ, నెత్తినేసుకోవడము; అందుకనే మనకు సంసారాల్లో ఎప్పటికీ తెగూ తెంపూ అంటూ ఉండదు.

నే నేదో మహా శ్రమపడిపోతున్నా ననుకొని మా మామగారు వచ్చి "నాయనా, లేచి మడిగట్టుకొని రెండు మెతుకులు నోట్లో వేసుకొని కాశ్శేపు కూచో; రాత్రి తెల్లవార్లూ నిద్దరుండదు, నీకు జబ్బు చేస్తుందికూడాను. ఇలా చేస్తూఉన్న కొద్దీ ఉంటూనేఉంటుంది. బళ్ళదగ్గర ఎవరో ఒకరు ఉంటారు. రా, మడిగట్టుకో" మని తొందరపెట్టారు. పెద్దవాడు ఆయన అలా బలవంత పెడుతూఉంటే ఇంక బాగుండదని మడిగట్టుకోడానికి లోపలికి వెళ్లాను.

నెమ్మదిగా అందరిభోజనాలూ అయినాయి. సుమారు తొమ్మిదిగంటలయింది. జనమంతా బళ్ళదగ్గర చేరారు. బళ్ళుసరిపోయేటట్టు లేదు; పల్లెటూరు. మా మామగారికి

పలుకుబడి ఎక్కువ; అందుకని ఊళ్లోవాళ్ళు కూడా సగము మంది పెళ్లికి బయలుదేరారు. ఉన్నమట్టుకు బళ్ళల్లో బండి కొక్కొక్కజోడా చొప్పున దంపతులంతా సర్దుకున్నారు. ఎవళ్ళని దిగమంటే వాళ్ళకే కోపము. పోనీఅని ఆ బండిలో ఇంకొకళ్ళను కూచోబెట్టినా కోపమే, ఏలాగు. ఇంకాకొన్ని బళ్ళు పిలిపించి వీలైనంతవరకూ ఆడవాళ్ళనూ, పిల్లలనూ ఎక్కించి తక్కనవాళ్ళను కొంతమందిని కొంతదూరము నడ వమన్నాము. బళ్ళవాళ్ళల్లో ఒకతనికి నేనంటే చాలాభక్తీ, గౌరవమూను-ఎందుకొ తెలియదు. "బాబూ గాంధీమహాత్ము లులా ఉంటారు.—వాడెప్పుడూఅయన్ను చూడలేదులెండి.— తమ రెక్కడ కూసున్నా దెహెబెంద్రనబలా గుంటుందండి. తమరు నాబండిలో కూసోండి. నాబండి వేరే అట్టేపెట్టి ఎవ్వరూ ఎక్కకుండా చేస్తానండి. తమరు దయచెయ్యాలం" డని, అబండీలో మరికాస్త గడ్డివేసి, నాపరుపు పరిచి, నాసా మానుసర్ది, అట్టేపెట్టాడు.

మా అవిడను బండీ ఎక్కమంటే పిల్లవాడికి పాలుపోసి వస్తా నన్నది. 'పాలు పొయ్యడానికి చెంచా కనబడలేదు. పెట్టెలో పెట్టినట్టున్నాను' అని తెప్పించి చూసింది. కనబడ లేదు. నాపెట్టెలో చూచిన జ్ఞాపకమునాకు: అందుకని నాపెట్టే తెప్పించి చూశాను. అందులోనూ లేదు. ఇంతట్లోకే మా పెద్ద పిల్ల వచ్చి 'నాన్నా, నాపెట్టెలో ఉన్న' దన్నది. కాబోలు సను కొని దానిపెట్టెకూడా తెప్పించి చూశాను. అందులోనూ లేదు. మా అవిడకు ఏదో జ్ఞాపకము వచ్చి ముఖము విప్పారింది. 'ఏమీ, చెమిచా కనపడ్డవా.' అన్నాను. 'అనవాలుగా ఉం టుందని పిల్లవాడి ఉయ్యాలాతొట్టిలో పరుపుకింద పెట్టాను' అని ఒకపరుగున వెళ్లి చెంచా తీసుకొచ్చి పాలుపొయ్యడ

మారంభించింది. 'ఏడిసినట్లే ఉన్నాయి తెలివితేటలు' అని విసుక్కుని నేను పెట్టెలు సవరించి బండిలో పెట్టించేసరికి పిల్లవాడికి పాలుపొయ్యడమూ అయింది. యావన్మందీ బళ్లల్లో ఎక్కి బళ్ళు సాగేసరికి పదకొండు గంటలయింది. ఎదుట ముప్ఫయిమయిళ్ళ ప్రయాణమున్నది. క్రింద నడుస్తూన్న మా పెద్దబావమరదీ మరికొందరు యువకులూను "చీకట్లో ఒంటరిగా వస్తున్నారు; భయము వేస్తుందేమో''నని భోగమువాళ్ళ బళ్ళలో కొంచెము ఇరుకుగాఉన్నా సర్దుకున్నారు.

తెల్లవారుఝామున రెండుగంట లవుతుంది. బండ్లు నెమ్మదిగా, నిశ్శబ్దముగా, కునికిపాట్లుపడుతూ వెడుతున్నాయి. బళ్ళలో జనంకూడా ఎంత ఇరుకుగాఉన్నా అలాగే కూచుని కునికిపాట్లు పడుతున్నారు. మా బండిలో పిల్లలు ఖులాసాగా నిద్రపోతున్నారు. మా అవిడ నన్ను సంబోధించి 'అలా తెల్లవార్లూ ఎలా కూర్చుంటారు, కాస్సేపు ఇలా పడుకోండి. నేను కాస్త సర్దుకుంటాను'అని అక్కడ తనే పడుకొని నిద్రపోయింది.

తెల్లవారుసరికి ఒక గ్రామముచేరినాము. అక్కడ ఆ పూటకు ఆగి, వంట చేసుకుని భోజనాలుచేసి, మధ్యాహ్నము రెండు గంటలకు బళ్లు కట్టించాము. మధ్యను గోదావరిపాయ ఒకటి దాటవలసి వచ్చింది. అది సుమారు ఒక మైలు వెడల్పు ఉంటుంది, ఇంకా ఫాల్గుణమాసమే అయినా అందులో నీరు లేదు. మధ్యనుమాత్రము కొద్దిగా ఉన్నది. బళ్లు పోనిచ్చారు. ఇసుకలో బళ్లు నడవడము కష్టముగా ఉన్నదని మగవాళ్ళను దిగి నడవమన్నారు. చచ్చినట్టు దిగి నెమ్మదిగా నడుస్తున్నాము. ఎండ పైన నెత్తి మాడుస్తోంది. అడుగున కాళ్లు

అంటుకుపోతున్నాయి.

ఇంతలోకే నీళ్ళదగ్గరకు చేరినాము. నరదాగా నీళ్ళలో నడవవచ్చునని కొందరు ఆడవాళ్ళూ, పిల్లలూ కూడా దిగినారు. వీళ్ళనుచూచి బోగమువాళ్లుకూడా బళ్లలోనుంచి కులాసాగా దిగి, నీళ్ళలో తిప్పుకుంటూ, నవ్వుకుంటూ, వేళాకోళాలాడుకుంటూ నడవడ మారంభించారు. బళ్ళవాళ్ళకు కొంచెము అల్లరి చేద్దామని బుద్ధిపుట్టింది. ఎడ్లకేసి చూశారు. ఎడ్లు గ్రహించి కళ్లు మీటినాయి; బళ్ళవాళ్ళు 'పప్ప'అన్నారు. వాళ్ళను విడిచిపెట్టి ఒక్క పరుగున పరుగెత్తినాయి; ఈ సంగతి బోగమువాళ్ళు కనిపెట్టలేదు నీళ్ళలోనుంచి ఇవతలకు వచ్చి రెండడుగులు వెళ్లేసరికి కాళ్లు చుర్రు మన్నాయి. బళ్ళవాళ్ళను కేకవేశారు. ఇంకెక్కడ బళ్ళు - అప్పుడే అవతల గట్టుకు చేరినాయి. ఇక్కడింక వాళ్ళువేసిన గంతులూ, కేకలూ, చేసిన అల్లరీ లెక్కలేదు. ఏమిచేస్తే ఏమిలాభము ? అలాగే నడవవలసివచ్చింది. మన మగవాళ్లు వాళ్లనలా నడవనిస్తారా? మనవాళ్లకు స్త్రీలపట్ల గౌరవము లేదనేది వట్టి మాట. తక్షణం పదిమంది యువకులు తమ పాదరక్షలు తీసి వాళ్లదగ్గరకు విసిరారు-తొడుక్కోమని. మరికొందరు తమ కండువాలు గిరవాటేశారు- వాట్లమీద నడవమని, ఇలాంటి వాళ్ళను చూస్తూకూడా మనవాళ్లకు Chivalry లేదంటే నప్పుకోగలమా !

సూర్యాస్తమయము అయేసరికి పెళ్లికొమార్తెగారి గ్రామము చేరాము. వివాహము తెల్లవారుఝామున. సామాను విడిదిలో సర్దుకుని, రెండు మెతుకులు నోట్లో వేసుకుని, రెండు కునుకులు తీద్దామని పడుకున్నాను. కన్ను మూశానో లేదో, ఒక పెద్దమనిషి తొందరగా నన్నులేపి, 'అయ్యా ఎంతైందండీ'

అన్నాడు. నాకు ఒళ్ళు మండింది. మండదు మరి? ఇంత మంది ఉండగా టైము తెలుసుకోటానికి నన్నే లేపాలీ? గడియారము తలక్రిందపెట్టుకు పడుకుంటా ననుకున్నాడా! ఈయన్ను ఏడిపిద్దామని బుద్ధిపుట్టింది. 'ఎంతేమిటండి, ఎంత అయినా అయినదేను, అన్నాను 'అదికాదండీ సుమారు ఎంత అవుతుందండి' అన్నాడు. 'ఇప్పటికి మూడువేలు అయిందండి. ఇంకా పెళ్ళంతా ముందే ఉన్నది' అన్నాను. ఆ బ్రాహ్మడు తెల్లబోయాడు. చీకట్లో నాకు కనబడలేదు. అయినా కాని తెల్లబోయిఉండా లనుకున్నాను. 'అదికాదండి అయ్యా, డబ్బుసంగతి కాదండి, సుముహూర్తమున కింకా ఎంతవ్యవధి ఉన్నదో తెలుసుకుందామని ఎన్నిగంటలైనదో అడిగానండి' అన్నాడు సవినయముగా. 'ఓయి నీఇల్లు బంగా రంగాను, అదిటయ్యా. నే నిలా అనుకున్నాను; సరే. టైముసంగతి నాకు ఎలా తెలుస్తుంది బాబూ, నిద్రపోతున్న వాడికీ గడియారము తలక్రింద ఉంటుందనుకున్నారా? లేక నా కేమైనా దివ్యజ్ఞాన మున్నదనుకున్నారా? ఇప్పుడే కునుకు పడుతోంటే మునిగిపోయినట్టు లేపావు?' అని అవతలవైపుకు తిరిగి పడుకున్నాను. ఆ బ్రాహ్మడు మారుమాట లేకుండా చక్కాపోయాడు.

మళ్లీ ఎలాగో తంటాలుపడి కన్నుమూశాను. చక్కనికల వచ్చింది. కల మధ్యలో ఉండగా మాచాకలివాడు కొంచెము అమాయకుడు - వచ్చి హడావిడిగా నన్నులేపాడు. 'బాబూ, పెళ్లికుమారుడుగారికి ఎదురు సందేహ మవుతోందిటండి. మామయ్యగారు తమర్ని దయచెయ్యమన్నారండి' అన్నాడు. వాడు లేపినందుకు కొండంత కోపము వచ్చింది కాని వాడి మాటకు నవ్వువచ్చింది. ఎదురుసన్నాహ మని వాడి ఉద్దే

శమైఉంటుందనుకున్నాను. పెండ్లికుమారుడుగారి కైనాసరే, వారి తండ్రిగారి కైనాసరేను, ఎదురుసందేహ మయ్యేది, పక్కసందేహ మయ్యేది; నేనుమట్టుకు రాను. ఈమాటు నువ్వుగాని, నీవారసులుగాని, తదితరులుగాని ఎవరువచ్చి నన్ను లేపినా బ్రహ్మ బద్దలుకొడతాను. ఈసంగతి అందరి తోనూ చెప్పు. అవసరమయితే కరణముగారితోటి చెప్పి సాటింపు చేయించమను. ప్రమాదము జరిగినతరువాత ఏమనుకొనీ ఏమీ లాభము లేదు' అన్నాను. వాడు హడలి పోయి నోరు మూసుకు చక్కాపోయాడు.

ఇంక నిద్దర పట్టలేదు. విడిదిలో అంతా పెళ్లికి వెళ్లిపో యారు. వచ్చినదె పెళ్లికి కదా! చూచివద్దాము, లెకపోతే బాగుండ దనుకొని, లేచి, చాకలితెచ్చిన సేలముజరీపంచ కట్టి, షర్టూ, కోటూ తొడుక్కొని, ఉప్పాడజరీఖండువా పైన వేసుకుని, పెళ్లిపందిట్లోకి చేరాను. పందిట్లో జనము కిటకిట లాడుతున్నారు. ఒక పక్కను మేజువాణీ జరుగుతోంది. ఆడ వాళ్ళంతా ఒకపక్కను కూర్చున్నారు. పండితులవేదఘోషతో పందిలి మారుమ్రోగుతోంది. నేను నెమ్మదిగా జనాన్ని తప్పించుకుని ముందు కూర్చున్నాను. పెండ్లికుమార్తెను బియ్యపుతట్టలో పెట్టి అప్పుడే పందిట్లోకి తీసుకువచ్చారు. ఆ అమ్మాయి ఒక్కసారి తలయెత్తి సభకేసి చూసి మళ్లీ తల వంచుకుని నెమ్మదిగా పెళ్లికొడుకువైపు చూసింది. పెళ్లి కొడుకూ ఆపిల్ల కేసి చూస్తున్నాడు. ఇద్దరికళ్లూ కలుసు కున్నాయి. ఒక్కక్షణము ఇద్దరూ సభసంగతి మరచిపోయారు. వాళ్ళ లేతహృదయాల్లో ఏమిఉద్వేగము కలిగిందో, వాళ్ల లేత మనసులలో ఏమిభావాలు పరుగులె త్తినాయో ఎవరు తెలుసుకోగలరు! వాళ్లకే తెలియదనుకుంటాను.

'కాళ్లు పళ్లెములో పెట్టు నాయనా' అన్నాడు పురోహితుడు. కన్యాప్రదాత పెళ్లికొడుక్కి కాళ్లు కడిగి, కొంచెము గద్గదస్వరముతో 'కన్యాం కనకసంపన్నాం........దశపూర్వేషాం........ శాశ్వతబ్రహ్మలోక నివాససిద్ధ్యర్థం' అని కొబ్బరిపండూ పిల్లనూ పిల్లవాడికిచ్చాడు. వాళ్ల ఉద్దేశము, అనగా ఈ మంత్రకారుల ఉద్దేశము, ఏమిటో! వాళ్లకు ప్రేమసంగతి ఏమీ తెలియదేమో అనుకుంటూ ఏమేమిటో ఆలోచిస్తూకూచున్నాను. పెళ్లికొడుకు లేచి మంగళసూత్రము ముడివేస్తున్నాడు. బ్రాహ్మణు లాశీర్వదిస్తున్నారు. అమంగళమేమీ వినపడకుండా భజంత్రీలు వాయిస్తున్నారు. నాజీవితములో ఇటువంటి క్షణమే ఒకటి జ్ఞాపకము వచ్చింది. కళ్లు కొంచెము చెమర్చినాయి. తల ఎత్తి ఆడవాళ్లు కూర్చున్నవైపు చూశాను. మా ఆవిడకూడా ఇంద్రనీలాలలాగ మెరుస్తున్న తనవిశాలనేత్రాలతో నాకేశిచూస్తోంది. మాయిద్దరికళ్లూ కలుసుకున్నాయి. కొంతసేపు పూర్వస్మృతిలో ప్రపంచము మరచిపోయాను. తక్కిన ఆడవాళ్ళకళ్లూ తమభర్తల కోసము వెతుక్కుంటున్నట్టు తోచింది నాకు. ఆ అయిదురోజులలోనూ ప్రతిక్షణమూ తమ పూర్వానుభవమంతా జ్ఞప్తికితెచ్చుకుని ఆడవాళ్ళు అపారమైన ఆనందం అనుభవిస్తా రనుకుంటా? వాళ్ళకు పాపం ఎప్పుడూ వర్తమానమేమీ లేదనుకుంటాను, గతముస్మృతికి తెచ్చుకోవడం, భవిష్యత్తునుగురించి ఆలోచించడమూ ఈలాగే వాళ్ళకు రోజులువెడుతూ ఉంటాయనుకొంటాను. మాపెద్దపిల్లఅయిదేళ్ళది. పెళ్లికూతురుదగ్గర నిలబడి జరిగేదంతా బహుశ్రద్ధగా చూస్తోంది. దాని భవిష్యత్తును గురించి అదికూడా ఆలోచిస్తున్నదేమో!

తలంబ్రాలు పోసుకోవడ మైనది. ఫలప్రదానము లిప్పించి

మంగళహారతు లిచ్చి వధూవరులను పీటలమీదనుంచి లేవదీసి ఒక్కసారి విడిదిలోకి తీసుకువచ్చారు. ముడి పడిపోయింది ; ఇంకనది బ్రహ్మకుకూడా అభేద్యము.

కావలసిన దేమిటో అయిపోయింది.మూడుముళ్లూ పడ్డయి. ఇంకను మిగిలింది ఆడపడుచులాంఛనాలూ, వియ్యపరాలు లాంఛనాలూ, అల్లుడులాంఛనాలూ, అల్లుడు అలగడమూ, ఆడపడుచు లలగడమూ, వచ్చినవాళ్లు అలగడమూ, మధ్యను ఆడపెళ్లివారి ప్రాణాలు తియ్యడమూను. ఎలాగో ఆలాగు వాళ్ల దగ్గరనుంచి వచ్చినంత రాబట్టి వాళ్ళను దివాలాఎత్తించినంత పని చెయ్యడము. అప్పటికీ ఒక్కళ్ళకూ తృప్తి లేకపోవడము.

ఇక పెళ్లికి వచ్చినమగవాళ్ళకు పనేముంది? ఏమీలేదనిపోవచ్చునా! పోరు. అయిదురోజులూ ఉండడమూ, ఇంకా వీలైతే తిరిగి గృహప్రవేశానికికూడా రావడమూను. ఇంక అయిదురోజులూ ఇక్కడ కూచుని, భోజనములదగ్గరసీ తగాదా; ఫలహారములదగ్గర తగాదా ; భోగముమేళముదగ్గర తగాదా. ఎవ్వళ్లూ ఏమీనోరెత్తడానికి వీలులేదు; ఇదేమని అనడానికి వీలులేదు. ఏమన్నా అంటే కోపమువచ్చి లేచిపోవడము ఈమాత్రము సర్దుబాటు చేసుకోలేకపోతే పెళ్లికి పిలవడమెందుకని నిష్ఠూరములాడడము. ఇటువంటి మహామహుల జీవితములు వ్రాయవలెనంటే, వారు ఏయేవివాహాలలో ఎలా దెబ్బలాడినది తప్ప ఇంక వ్రాయవలసినహంశము ఏమీ ఉండదనుకుంటాను.

ఇంక తాంబూలాలు సేవించి పేజువాణీలదగ్గరకు చేరుతారు. పోనీ, వచ్చినవాళ్ళు వాళ్ళవిద్య చూచి సంతోషించవచ్చునా. ఊఁహు - చక్కనిజావళీ కాని, పదంకాని, శ్లోకం

కాని, అష్టపడికాని, పాడి అభినయిస్తుంటే ఎవరో ఒక అమా యకుడు మహా విద్వాంసుడులా ముందుకువచ్చి, 'ఏదేనీ హిందూస్తానీ పాడవే' అనడం. పాపము, ఎంతకోపం వస్తే మట్టుకు వాళ్లు ఏమిచెయ్యగలరు. హిందూస్తానీ పాడుతుంటే ఇంకోపెద్దమనిషి 'ఇకనైనావేమి ఈమాయమల్లు' అని పాడ మనీ తనదేశాభిమానం ప్రకటిస్తాడు. నాకు అభినయమంటే చాలా అభిమానము. వచ్చినజట్టులో ఒక గొప్ప విద్వాంసు రాలు ఉన్నదని విన్నాను. సావకాశముగా చూద్దామంటే ఏలాగు? అసహ్యమువేళ ఒక్కరోజునా అక్కడ కూచోలేదు, సనాయిపాటకుడిచేత పాడించి నే నొక్కడినీ అక్కడ కూచుని ఆనదించేవాడిని.

ఎలాగైతేనేమి, అయిదురోజులూ గడచినాయి. అయిదవ రోజున కళ్ళ నీళ్లు గుక్కుకుంటూ 'అష్టవర్షా భవేత్కన్యా పుత్రన త్వాలితా మయా........'అని పిల్లను ముఖ్యులైనవా రందరికీ వప్పచెప్పారు. చూచేవాళ్ళందరికీ, అందులో ముఖ్య ముగా ఆడవాళ్ళకు, కళ్ళ నీళ్లు వచ్చినాయి.

హడావిడిగా, పోయినవి పోగా ఉన్నవి పెట్టెలలో సర్దుకుని, నిద్దర్లు లేక, వేళపట్టున తిండిలేక, తిన్నది అరగక, పిల్లలకు పోషణ లేక, నలుగుడుపడి ఇంటికి చేరుకున్నాము.

వధూవరులు కుడికాలు ముందు పట్టి గృహప్రవేశ మయారు. మరునాడుసంతర్పణా, ఆరాత్రి బారముమూను. అమరుసటిదినము బోగమువాళ్లు సంభావన పుచ్చుకుని శలవు తీసుకున్నారు. ఇంకను, వాళ్లు వెడుతూఉంటే వీధిపొడుగునా ఊళ్లో మొగపురుగులంతా బారులుతీర్చి నిలబడ్డాయి. పిల్ల వాళ్ళు చెడిపోతారు ; మన మిక్కడుంటే వాళ్ళు రారుకదా అని పెద్దవాళ్ళు వచ్చారు. పెద్దవాళ్లే చూడగాలేనిది మనము

చూడకూడదా అని కుర్రవాళ్ళు వచ్చారు. కొందరు ఊరు పొలిమేరదాకా సాగనంపి బిక్కమొహాలు వేసుకుని వెనక్కు వచ్చారు. కొందరు సాహసముకలవాళ్ళు బళ్ళతోటికూడా పడ పలకాలవదాకావెళ్లి వాళ్ళను పడవఎక్కించారు. పడవ గట్టుని దాసుకుంది. లోపలికి తొయ్యవలసి వచ్చింది. సరదాగా ఇందులో కొందరు కుర్రవాళ్ళు పడవ నడిఏట్లోకి వెళ్లేదాకా తోశారు. ఇంక మునిగిపోతామేమోనని భయపడి ఇవతలికి వచ్చారు. శలవుపుచ్చుకు వెడదామంటే బోగమువాళ్ళు కన పడలేదు. కొంతదూరము వాళ్ళపడవ లాగినా ముక్తి వస్తుం దని రెండుమైళ్ళదూరము లాకుదాకా ఒక్కవిసురున లాక్కు పోయారు. పడుచుదనము, పడవలో బోగమువాళ్ళు సంతో షిస్తారనే ఉత్సాహమును విసురు కాకేమి?

బోగమువాళ్ళు ఈలోపున వాళ్ళమాటమరచిపోయి, పడ వలో ఒకవర్తకునితోటి సంభాషణ అరంభించారు. పడవ లాకుదగ్గరకు వచ్చింది. ఈకుర్రవాళ్ళుపడవలోకేవెళ్లి బోగము వాళ్ళను సంబోధించి మేమింక వెడతామనిఅన్నారు. వీళ్ళ నెప్పుడు జన్మమధ్యమందు చూడనట్టునటించి, 'చిత్తము వారేపోయేవాళ్ళంతా మాతోటి చెప్పి వెళ్ళనక్కరలేదు' అన్నారు. ఈకుర్రవాళ్ళకు ప్రాణాలు పైనఎగిరిపోయినాయి. ఒకళ్ళమొగాలు ఒకళ్ళుచూచుకొన్నారు. మాట్లాడకుండా ఇంటికి చేరుకుని ఒక్కొక్కళ్ళు నాలుగులంఖణాలుచేశారు.

నాకు పెళ్ళంటే మహచెడ్డసరదా - ఇంతతంటా, ఇంత గందరగోళమూ, ఈమేజువాణితో, ఈ అకాలపు భోజనాలూ లేకుండాఉంటే మహాసరదాగానే ఉంటుంది. వధూవరులు ప్రాజ్ఞులైతే ఇంకనడిగారూ! వాళ్ళ పెళ్ళివాళ్ళుకూడా ఆనం దిస్తారనుకొంటాను. అంటే అది స్వల్పవిషయం. పెళ్ళి జర గడం మనం ఆనందించడమే ప్రధానవిషయం.

ఏది యెలావచ్చేదీ, ఎప్పుడు వచ్చేదీ, ఎందుకువచ్చేదీ మన కేమీ తెలియదుకదా! మెట్టవేదాంతంలోకి దిగాననుకోకండి. మన జీవితంలో మంచికో, చెడ్డకో, అనేక మార్పులు వస్తుంటాయి. ఈ మార్పులకు కారణమేమిటని మనమెప్పుడైనా యోచిస్తామా! కారణంలేని కార్యం ఉండదుకదా! అలా ఆలోచిస్తే ఎక్కడిపరకు లాక్కుపోతుందో ఊహించలేము. లేదూ, పోనీ మనము ఏపనేనా చెయ్యబోయేటప్పుడు దానిఫలితము ఏమవుతుంది అని ఆలోచిస్తామా మనం! అంటే, పెద్దవ్యాపారాలు, ఉద్యోగాలు, అలాంటివాటిసంగతికాదు నేనుచెప్పేది. వాటిని గురించి ఎలాగూ ఆలోచిస్తాము. చచ్చేటట్లు రాత్రింబగళ్ళు నిద్రాహారాలు మానుకొనికూడా ఆలోచిస్తాము. ఈ వ్యాపారంచేస్తే ఇంతలాభంవస్తుందికదా. ఇంతవస్తే ఈమేడకడదామనో, ఈ భూమికొందామనో, ఈ బిరుదుకోసం ప్రయత్నిద్దామనో, కొడుకును ఇంగ్లాండు పంపిద్దామనో, శత్రువులెవళ్ళేనా ఉంటే వాళ్ళను మాడ్చేద్దామనో, ఏదేదో ఆలోచనలు ఉంటాయి. ఉండకపోవు.

మామూలుగా నిత్యవ్యవహారంలో మనంచేసే ప్రతి చిన్న పనికీ ఇంతసేపు ఆలోచిస్తామా అంట! అదీనేననేది! కాఫీ హోటలుకువెళ్ళేటప్పుడో, బీచికి షికారువెళ్ళేటప్పుడో, లేదా ఏదైనా మీటింగుకు వెళ్ళేటప్పుడో, దానిఫలితం ఏమిటని మనం దీర్ఘాలోచన చెయ్యంచూడండి. చేసీప్రయోజనంలేదనుకోండి! అదివాస్తవమేకాని ఒక్కొక్కప్పుడు ఇటువంటి స్వల్పాలనుకునే వాటివల్లనే జీవితంలోని విపరీతమైన మార్పులు వస్తుం

టాయి. తరువాత ఆలోచించుకుంటే మనకే ఆశ్చర్యము వేస్తుంది.

పాండవులు ఆనాడు జూదమాడే రోజున ఇలావస్తుందని వాళ్ళు ఊహించారా-లేదు. రోజూ వాళ్ళకీ జూదము ఆడుతూ ఉండడము, గెలుపు ఉండడమో, ఓడుతూ ఉండడమో పరిపాటి అయిపోయింది, మనక్లబ్బులో బేస్తు ఆటలాగ. కాని ఆనాడు కాస్త ఆలోచించిఉంటే భారతయుద్ధం జరక్కపోయేది కదా! గయుడు ఎప్పుడూ షికారువెళ్ళడమూ తాంబూలము వేసుకునో చుట్టకాలుస్తూనో ఉమ్మివేస్తూఉండడమూ అలవాటే కదా! ఆనాడు కాస్తపరాకుతగ్గించి, పక్షిలామనం పైన ఎగురుతున్నాము, ఉమ్మేస్తే ఎవరినెత్తినపడుతుందో అని కాస్త ఆలోచించిఉంటే అంత గాడిదగత్తర కాకపోయేదికదా! నెపోలియన్ ఆరోజున.........ఆగొడవంతా ఎందుకులెండి. మారత్తయ్యసంగతి చెప్పొచ్చి ఈ గొడవలోపడ్డాను. వాడికి పాపం ఇలాగే అతిస్వల్పవిషయంవల్ల వాడిసంసారము ఛిద్రమయిపోయింది. ఈ పుట్టిములకంతా కారణం ఆరోజున నాటకానికెళ్ళడం! రోజూ ఎంతమంది నాటకాలకూ, సినీమాలకూ వెళ్ళటంలేదు చెప్పండి. వాళ్ళ అందరికొంపలూ ఇలాగే కూలిపోయాయా, వాడిఖర్మమిలాకాలింది కాని! మారత్తయ్యకు పాతికసంవత్సరాలు వచ్చేవరకూ ఎప్పుడూ నాటకంమొగం ఎరగడు. నాటకాలపేరు చెపుతే ఒళ్ళుమండిపోయేది. వాడికి మేమెవరమేనా నాటకానికి వెడతామంటే, ఎందుకలా డబ్బుతగలేసుకోడమని మమ్మల్ని చీవాట్లువేస్తుండేవాడు అటువంటివాడు ఒకరోజున నాటకానికి వెళ్ళడం సంభవించింది. ఇంక ఎంతగోలా జరుక్కుండా ఎలా ఉంటుంది?

గున్నయ్య అని మాకు ప్రాణస్నేహితుడు. వాడి అమ్మమ్మ చచ్చిపోతే అమధ్య, వాడికి కొంతవారసత్వం కలిగింది. ఏ మాత్రమో రొఖంకూడా చేతికొచ్చింది. ఆనంతోషంచేత— అమ్మమ్మపోయినందుకుకాదు—డబ్బుచేతికొచ్చినందుకు — మాకు విందుచేశాడు. పొద్దున్నే పరకడుపున ఫలహారంతో ప్రారంభించి, రాత్రిభోజనాంతంవరకూ చచ్చేటట్టుదట్టించి, ఆప సోపాలు పడుతుంటే, రాత్రినాటకంకూడా చూస్తేనేకాని ఈవిందు పూర్తికాదని మమ్మల్నిచంపి లాక్కుపోయాడు. రత్తయ్య ఎంతగోలపెట్టినా మేమువినిపించుకోలేదు. అయాస మన్నాడు, తలనొప్పి అన్నాడు, నిద్రమేలుకుంటే జబ్బు చేస్తుంది అన్నాడు. నాటకం చూడకూడదని తనకు Principle అన్నాడు. అఖరుకు, మాగున్నయ్య కాస్తబండ ముండావాడులెండి - ఇదిపనికాదనుకొన్నాడు. "ఏడిచావులే వోయ్, ఇంక కట్టిపెట్టుసోది. పాదిరీలకూ, బ్రహ్మసమా జకులకూ, కాలేజీ ప్రిన్సిపాల్సుకూ, ఇంకా అలాటి ముసలాళ్లకూ, ముతకాళ్ళకూకాని, ముక్కుపచ్చ లారని ముండకు, నీకు, అందులో కొత్తగా enrol అయిన advocate కు నీకు principles ఏమిటి నీపిండాకూడు. ఊరుకొంటున్నకొద్దీ మహాచెలరేగుతున్నావు. నడువు", అని మారత్తయ్యకు నడవడానికి అవకాశం ఇవ్వకుండానే అమాంతం ఎత్తుకెళ్ళి బండిలో కూలేశాడు. రత్తయ్య ఇంక మళ్ళీ నోరెత్తితేవొట్టు. ఆరాత్రి చింతామణి నాటకం. నటకులంతా సుప్రసిద్ధులు, బిరుదాంకితులు, మెడలిష్టులు, రికార్డులు ఇచ్చినవారూను. అందుచేత అంతా తలో ఊరునుంచీ ఆరాత్రే దిగారు. నాటకం ఎంత అద్దాన్నం గా ఉందోచెప్పలేను. యమబాధపడుతూ చివరవరకూ క్యాసా

బియాంకాలులాగ కూటున్నాము. ఎన్నివాదులుచేసినా మా గున్నయ్యా ఈఋణం తీర్చుకోలేడు, మారత్తయ్యా పడ్డబాధ చెప్పనే అక్కరలేదు. బయటికివచ్చిన తరువాత గున్నయ్యాని ఖూనీచేస్తాడెమో అని హడలిపోతున్నాము, గున్నయ్యాకూడా చాలాచిన్నపుచ్చుకుని, అనేకరకాలుగా క్షమార్పణలు చెప్పుకున్నాడు. అంతకంటె ఏమిచెయ్యాగలడు పాపం! రత్తయ్యా అంతా దిగమింగుకుని మౌనముద్రవహించాడు. ఇంకజన్మలో మళ్ళీ మాట్లాడడేమో అనుకున్నాం. అలా మాట్లాడకపోయినా బాగుండేది. వాడి సంసారం ఛిద్రంకాకుండానే ఉండేది.

రాత్రిఎవళ్ళ కొంపలకు వాళ్ళు చేరుకున్నాం. మరునాడు పొద్దున్న మళ్ళీ కలుసుకోలేదు, సాయంకాలము నాలుగు గంటలకే, క్లబ్బులో హాజరయ్యాము. నేను బిలియర్డ్సు రూములోకి వెళ్ళాను. గున్నయ్యా టెన్నిసుకోర్టులో వీరవిహారం చేస్తున్నాడు. రత్తయ్యా పేపరు పుచ్చుకుని వరండాలో కూర్చున్నాడు. నేను కాస్సేపు బిలియర్డు బంతులు బద్దలు కొట్టి వెల అర్ధరూపాయి పద్దురాసుకుని వరండాలోకి వచ్చేసరికి రత్తయ్యాచుట్టూ ఒక వందమంది మూగినట్లు మూగారు. మా రత్తయ్యా నదురూ బెదురూ లేకుండా, కాంగ్రెసు అరేటరులాగ లెక్చరు కొడుతున్నాడు. ఏమిటో విందామని దగ్గరకు వెడుదునుకదా — క్రితంరాత్రి నాటకం గొడవ! ఎవరో మావాడిని కాస్త కదిపినట్టున్నారు. రాత్రి నుంచీ అణిచిపెట్టినదంతా ఒక్కసారి కట్టతెగి మహాప్రవాహంలా బయటపడ్డది; మావాడి విమర్శన విన్నకొద్దీ, నాకూ ముచ్చటేసింది. మామూలు పత్రిక గొడవలా కాకుండా చాలా నూతనంగానూ, రసవంతంగానూ ఉంది. మా వాడికి ఆ మాత్రం రసికతగాని, విజ్ఞానంగాని, వివేకంగాని ఉందని

అనుకోలేదు. తమపేరుకూడా పూర్తిగా సంతకమేనా చెయ్యలేని వాళ్ళంతా నాటక విమర్శలు చేస్తున్నరోజుల్లో పెద్ద పాండిత్యం అవసరం లేదుకాని అయినా మావాడి విమర్శ మట్టుకు చాలా బాగుంది అంతావిని సభలో ఒక పెద్దమనిషి "ఏమండీ రత్తయ్యగారూ, ఇదంతా కడుపులో పెట్టుకోకపోతే ఏ పేపరుకన్నా రాయకూడదూ. చచ్చిపోతున్నాం, ఈ పాడు నాటకాలతోటి. మీరు వ్రాసిఇవ్వండి నేను పంపిస్తాను" అన్నాడు. అన్నట్లుగానే మర్నాడు మావాడు వ్రాసిఇచ్చాడు. ఆ పెద్దమనిషి పత్రికకు పంపించారు. సకాలంలో అచ్చుపడ్డది. ఆ దెబ్బతో రత్తయ్య పెద్ద నాటకవిమర్శకుడయ్యాడు. ఇంకను ఆవూరు ఏ కంపెనీ వచ్చినా రత్తయ్యకు Complimentary Tickets పంపడం మొదలుపెట్టారు. టిక్కెట్టు, వాళ్ళు పంపినతరువాత వెళ్ళకపోతే బాగుండదని నాటకాలకు వెళ్ళడం ప్రారంభించాడు. మధ్య మధ్య విమర్శనలు వ్రాస్తూ వుండేవాడు. కొన్నాళ్ళయిన తరువాత అందరికీ వ్యతిరేకంగా రాసేసరికి, అన్ని కంపెనీలవారూ కూడా పలుకున్నట్లు Free ticket పంపడం మానేశారు. ఇలాగుండగా- మా వూళ్లో కొందరు పెద్దమనుష్యులు సంప్రదించుకొని, నాటక సమాజం ఒకటి స్థాపించవలెనని తలపెట్టారు. ఈ రోజుల్లో ప్రతివాడికి అదో జబ్బుకాదూ - తను ఎలాఉండి ఏమైపోయినా, ప్రపంచాన్నీ- దేశాన్నీ, గ్రామాన్నీ, అధమం పక్కఇంటి వాడినో ఉద్ధరిస్తున్నట్లు అనిపించుకోవలెనని ప్రతి వాడికీ సంకల్పము. ప్రస్తుతం నాటకాల సంగతేమీ బాగా లేదు. అందుకని అందరిదృష్టి నాటకాలమీద పడ్డది. వాన్ని ఎలాగయినా ఉద్ధరించి తీరవలెనని అనేకమంది ప్రయత్నాలు చేస్తున్నారు.

ఒక్క అరగంటసేపు బ్రహ్మ అవతలకి తప్పుకుని, సృష్టి వ్యవహారము తనచేతిలో విడిచిపెడితే ప్రపంచమంత అధ్వాన్నంగా ఉండకపోనని ప్రతి మనిషీ అనుకుంటాడు. మా వూళ్లో కాలేజీ ఏక్టర్లు (అనగా కాలేజీలలో చదువుకునే టప్పుడు ఏ పండుగకో వేషం వేసుకున్న బాపతు) క్లబ్బు ఏక్టర్లు, ఏనివర్సరీ ఏక్టర్లు, ఓల్డు బాయిస్ డే ఏక్టర్లు, 'మనమే స్టేజిమీది కెడితేనా' అని ఊహించుకునే ఏక్టర్లు, ఇంకా అమాంబాపతూ ఇలాంటివారంతా పాతిక ముప్ఫయిమంది టౌను హాలులో సభ జరిపి, ఇటువంటి పట్నవాసంలో ఒక నాటక సభ లేకపోవడము చిన్నతనంగా ఉన్నదనీ, అందులో రత్తయ్యలాంటి విమర్శకాగ్రేసరులూ,సుబ్బారావులాంటి నటకులు, నరసింహారావులాంటి పాటకులు, వెంకటశాస్త్రిలాంటి గ్రంథకర్తలు, ప్రసాదరావులాంటి చిత్రకారులు, ఉన్నచోట నాటకం కంపెనీ లేకపోవడంకంటే హాస్యాస్పద మేముంటుందని అడిగాడొకాయన, వెంటనే ఇంకొకరులేచి తప్పకుండా సభ వెంటనే స్థాపించవలసినదని తీర్మానించారు.

మావూళ్ళో grand old man ఒకాయన ఉన్నారు. అన్ని ఊళ్ళకూ ఉంటారులెండి: మావూరాయన మరీ grand అన్నమాట. ఇక్కడ అమ్మవారిజాతర మొదలు అర్టు ఎగ్జిబిషన్ వరకూ ఏదివచ్చినా ప్రథమతాంబూలము ఆయనకుఇవ్వడము ఆనుమాయితీ. ఇవ్వకపోతే ఏం ప్రమాదిస్తుందో అని భయమనుకుంటాను అందరికీ. అనగా అన్నిటికీ president పదవి ఆయనకు జన్మహక్కుగా ఏర్పడ్డది. మా రత్తయ్యను సెక్రటరీగా ఎన్నుకున్నారు. సకాలంలో సభనాటకాలు ప్రదర్శించడం ప్రారంభించింది. మొదటి ఒక ఇంగ్లీషు నాటకం తరువాత ఒక తెనుగునాటకం వేశారు. రెంటిలోనూకూడా

మార త్తయ్యకుకూడా పార్టు ఇచ్చారు. మావాడికి ఏదివచ్చినా విపరీతమే. అమిత serious గా తనపార్టు చదివి ఇంటిదగ్గర వీధులోను, స్నేహితులదగ్గర, ఎక్కడ పడితే అక్కడ rehearsals మొదలెట్టాడు. నాయకురాలికంటె హంగుదారుల హంగామా ఎక్కువైనట్లు, కథానాయకుడికంటె వెయ్యిరెట్లు ఎక్కువ బాధపడ్డాడు మావాడు. ఆ నెలరోజులూ మధ్య మేమంతా చచ్చామంటే నమ్మండి.

ఎలాగైతేనేమీ, నాటకాలుపడ్డాయి. ఫరవాలేదు బాగానే ఉన్నవనుకున్నారు అంతాను. రత్తయ్య కేవలం కబుర్లే కాకుండా బాగానే ఏక్టు చేశాడన్నారు. అందరిదాకా ఎందుకు, వాడే అన్నాడు, 'వెధవలంతా తగలేశారుకానీ, లేకపోతే ఇంకా బాగుండేది' అని. అనగా, నాటకం ఏమాత్రమేనా బాగుంటే తనవల్లనేనని. మరిరెండు నాటకాలయేసరికి మావాడికి 'రంగ గ్రామసింహరత్తయ్య' అనే బిరుదుకూడావచ్చింది. ఆబిరుదు ఎందుకువచ్చిందో, ఎలావచ్చిందో ఇప్పటికీ మాకుతేలలేదు. ఆవిషయం మావూళ్ళో పరిశోధకులింకా పరిశోధిస్తూనే ఉన్నారు.

అయ్యో ఆరాత్రి వాడి Tragedy కిప్రారంభమనుకోండి. గొప్పనటకుడుకాతగ్గ లక్షణాలన్నీ తనదగ్గర ఉన్నాయనీ, అవన్నీ తప్పకుండా Develop చెయ్యాలనీ, తనజీవితమంతా నాటకకళోద్ధరణకే వినియోగిస్తాననీ శపథంచేశాడు. రెండునిలువుటద్దాలు, ఒకహార్మోనియము, బజారులో దొరికినన్ని నాటకాలూ సంపాదించాడు. కన్యాశుల్కము మొదలు కనకతారవరకూగల అన్నిరకాల నాటకాలలోనూ, ముఖ్యపాత్రలకు సంబంధించిన భాగాల[illegible]వేశాడు. 'ఇన్నినాటకాలూ వేసుందా మీకంటెన[illegible] అన్నిటి

లోనూ నీకే నాయకపాత్ర ఇవ్వడానికి వీలౌతుంది గనకనా ఎందుకాశ్రమంతాను' అని ఊరుకోలేక అడిగాను. 'వేసినన్ని వేస్తుంది మాకంపెనీ, తక్కినవికొన్ని నేను Monoacting చేస్తాను' అన్నాడు. మళ్ళీ మాట్లాడితే Gramophone records ఇస్తానన్నాడు. లేకపోతే ఏహిందూస్తానీవాళ్ళనో, బెంగాలివాళ్ళనో పట్టుకుని ఎవళ్ళో నలుగురు ఉమ్మాయి జగ్గాయిలను తీసుకుని టాకీలు తయారు చేయిస్తానన్నాడు. ఇంకనేమనగలమువాడిని! అక్కడనుంచి ప్రారంభమైనదండి వాడిజబ్బు! జబ్బంటే మరేమీకాదు, మనిషిలో ఒకవిధమైన వింతమార్పు బయలుదేరింది. మాటలోను చూపులోను, నడకలోను, అంతామార్పే. ఊరికేమార్పని నేను చెపుతే నమ్మరు. ఆ రోజుల్లో మీరు వాడినిచూచి తీరవలసింది, కాస్త కాలుపొడుగు మనిషేమో స్వతహాగానూ, వాడుమామూలుగా నడుస్తుంటేపెద్దపెద్ద అంగలేసుకుని, ఎగురుతున్నట్టుగా ఉండేది. అలాంటిదిప్పుడదంతా మానేశాడు. అవతలకొంప లంటుకుని, ఇవతల పెద్దపులి తరుముకొచ్చినాసరే మంద గమనమేకాని, మామూలు నడకెక్కడా కనిపించడం మానే సింది; దుష్యంతుడి వేషంలో ఉన్న యడవల్లి సూర్యనారా యణలాగనో, శివాజీ వేషంలో ఉన్న మాధవపెద్ది వెంకట్రా మయ్యలాగనో నడవాలని వాడిఆశయము. మాకుమట్టుకు వాడినడకచూస్తే, గోదావరినుంచి నీళ్ళబిందె బుజాన్న పెట్టు కొని, ఉమ్ములలోనూ, అంట్లలోనూ ఎక్కడ కాలుపడు తుందో అని ఎత్తిఎత్తి అడుగులువేసే బాహ్మణ వితంతువు స్ఫురణకొచ్చేది. అదివరకెప్పుడూ క్లబ్బుకువస్తే పేపరువుచ్చు కొని ఒకమూలకూర్చునేవాడు. ఇప్పుడలా కూచోడం మానే శాడు. ఏదోదీర్ఘాలోచన చేస్తున్న రాజువేషంలాగ వరండాలో

పచార్లసాగించడం మొదలుపెట్టాడు. చూపు, మామూలు చూపు మొదలేపోయిందికదా! ఎప్పుడూ కనుబొమ లెగ రెస్తూండడమో, లేకపోతే ముళ్ళువేస్తూండడమో, దృష్టి ఎప్పుడూ భ్రూమధ్యమందో, నాసికాగ్రమందో, ఉండడమేకాని, మామూలు చూపు ఎప్పుడూ కనపడేదికాదు. మనతోటి మాట్లాడుతోంటేకూడా మనకేసికాకుండా, మననెత్తిపైనుంచి అవతలేదో చూస్తున్నట్లుగా Buster keaton కు మల్లేచూడడము నేర్చుకున్నాడు. ఇంక ఎవరితోనేనా మాట్లాడవలసివస్తే రాజుమంత్రితోనో, లేక వేడుకచెలికానితోనో మాట్లాడుతున్నట్లో, తండ్రి చెడిపోతున్న కొడుక్కి ఆఖరిసలహా ఇస్తున్నట్లో, లేక సినీమాలో విలన్ ఏహొటల్లోనో తోటిదొంగలను కూచోపెట్ట రహస్యంగా, ఇది ఇలాచేసి, అది అలాచేసి వాడిని డొక్క బద్దలు చెయ్యాలని బోధిస్తున్నట్లో మాట్లాడడమేకాని మామూలుధోరణి ఎక్కడా లేదుకదా! ఇంక, కనుబొమ్మ లెగరెయ్యడం, గుడ్లుమిటకరించడం, ముక్కులు పెద్దవిచేస్తోండడం, పెదవులు ఆడించడం, చేతులు రూడించడం, ఇలాటి వాటికి లెఖ్ఖే లేదనుకోండి! మాటకుముందు చెయ్యినొసటను పెట్టుకొని 'హా' అని ఒకపెద్ద నిట్టూర్పు విడవడం, ఏదోఆలోచించి అదేమీ లాభంలేదన్నట్లు తలతిప్పడం, మనమేదేనా చెపుతోంటే, మీసముమీద చెయ్యివేసి, 'ఎంతద్రోహము! తరువాత, తరువాత,' అన్నట్లు తల పంకిచడము— ఇంకా ఇటువంటి అవలక్షణాలు ఎన్నో.

రోడ్డుమీదనడుస్తూ, హఠాత్తుగా నిలబడిపోయి 'వీనినెన్నటికైన అధఃపాతాళమున కణగద్రొక్కి, నాకసి తీర్చుకొనకపోదునా' అన్నట్లు ఒళ్ళు, పళ్ళు, గుప్పిళ్ళు బిగపట్టి, గుడ్లెర్రజేసి, త్వరత్వరగా ఊపిరి విడుస్తూ, నిలబడిపోయేవాడు.

గోదావరిగట్టున నడుస్తూ పక్కనెవరేనా కుర్రాడుకూడా ఉంటే 'ప్రేయసీ, చూచితే, ప్రకృతిరామణీయక' మన్నట్లు వాడిబుజముమీద చెయ్యివేసి, బుగ్గనిమురుతూ, రెండోచెయ్యి ఆకాశాంకేసిజూపి నిలబడిపోయేవాడు. ఇలా ఎన్నని చెపుతే మీకు తెలుస్తుంది. ఇదోజబ్బంటారా? కాదంటారా!

మేము అనేకవిధాల వేళాకోళముచేశాము. వెక్కిరించాము. ఏడిపించాము. తిట్టాము – తిమ్మాము. ఏంచేసినా వాడి వేషంమట్టుకు మార్చలేకపోయాము. భాషకూడా క్రమేణా గ్రాంధికంలోకి దింపడం మొదలుపెట్టాడు. ఏమిట్రా ఈ వెర్రివేషమంతానని ఒకరోజున నిలదీసి అడిగాము. వాని కేమీ సమాధానము లేదు. 'ఈశ్వరేచ్ఛ' అన్నట్లు ఆకాశం కేసిచేతులుచూపించాడు. మాకువొళ్లుమండింది. మండదూ! వాడితోటి మాట్లాడడానికి భయమాయె. రోడ్డున నడవడానికి సిగ్గాయె! మాగున్నయ్య కుక్క పందికొక్కుని మెడపట్టు కుని ప్రాణంపోయేదాకా ఝాడిస్తుంది చూశారూ, అలాగ రత్తయ్యగొంతు పట్టుకుని, పళ్ళు గలగలలాడేటట్లు రెండు ఊపులు ఊపి, 'ఏమిటీ గోలంతాను, నిన్నుచూడలేక మధ్య మేము చస్తున్నాము' అన్నాడు. అపళంగా నెత్తినచెయ్యి పెట్టుకుని 'నన్నేల ఇట్లు హింసించెదరు, హాపరమేశ్వరా, నేనేమి అపకారమొనర్చితిని' అని యధాశాస్త్రియంగా విలాపం ఆరంభించాడు. "నోరుమూసి సరిగ్గా సమాధానం చెప్తావా, లేకపోతే మళ్ళీ ఇందాకటి Dose repeat చెయ్య మన్నావా?" అని ఒక్క ఉరుము ఉరిమాడు గున్నయ్య. దాంతో హడిలిపోయి 'ఏమిట్రా నన్ను చంపుతారు-నేనెలా ఏడుస్తే మీకెందుకు-Acting అంటే ఏమిటో మీరెప్పుడూ Serious గా ఆలోచించినట్లు కనపడదు. Stage మీద

మనము Act చేస్తూంటే, ఏదోబిగబట్టి, ఏదోచేస్తున్నట్లు కాకుండా Natural గా ఉండాలి. లేకపోతే Effective గా ఉండదు. Art lies in concealing art అన్నాడు. అందుకని మన నిత్యజీవనంలోకూడా, ప్రతి ఆలోచనకూ, మాటకూ, తగ్గ Movements జాగ్రత్తగా ఆలోచించుకు చేస్తూంటే, అది Natural అయిపోయి, Stage మీద, Wouderful effect ఇస్తుంది. ఇంతకీ Serious గా Think out చేసి Practice చేసిన వాళ్ళెవళ్ళూ మనలో లేకపోవడంచేతనే మననాటకాలు అలా తగులడుతు న్నాయి.' అన్నాడు.

'ఓరినాయనమ్మా, మనంమామూలుగా ఉన్నట్లు Stage మీద ఉంటే బాగుంటుందికాని Stage మీద ఉన్నప్పుడు ఫలానప్పుడు ఇలాఅభినయిస్తే బాగుంటుందనుకొనిఊహించిన దల్లా బయటకూడా చేస్తుంటే, Stage మీదనే హాస్యాస్పదంగా ఉన్నప్పుడు రోడ్డుమీద ఎంత అసహ్యంగా ఉంటుందో ఆలో చించు. ఇంక నీవెర్రివేషాలు కట్టిపెట్టి మామూలుగా బుద్ధి కలిగి బ్రతికితివా సరేసరి. లేదూ, ఇంక నెప్పుడూ మాతో మాట్లాడ వద్దు.' అన్నాడు, గున్నయ్య. 'ఏమీ నన్నేకాకినిజేసి నట్టేటముంచిపోవుట మీకుధర్మమేనా' అని అభినయం అరం భించబోతూంటే 'ఒరేయి, రండిరా. వీడితో లాభంలేదింక, వాడివరసచూస్తే కీర్తనకూడా పాడేటట్లున్నాడు' అన్నాడు గున్నయ్య. హడిలి పారిపోయాము అక్కడనుంచి.

అయ్యా, నడిరోడ్డుమీదా, క్లబ్బులోనూ, పరాయివాళ్ళ దగ్గరనే ఇలా ఉన్నప్పుడు సర్వస్వతంత్రమైన భార్యదగ్గిర వాడింట్లోసంగతి ఇంకనడిగారూ! ఆవిడదగ్గిరచేసే శృంగా రాభినయాలూ, ఆవిడ ఎదుట కనపరచే విరహవేదనలూ,

ఇన్ని అన్నీకావు. బహుయోగ్యురాలుగనక ఆ అమ్మాయి, ఎన్నాళ్ళో ఓపికపట్టి ఊరుకొంది. ఎన్నాళ్ళకూ మారకపోతే బ్రతిమాలుకుంది; కోపగించింది; పుట్టింటికి వెళ్ళిపోతానని బెదిరించింది. ఏమిచేసినాసరే వాడిగుణము వాడుమానడే! ఒకరోజున నేను వాళ్ళింటికి వెళ్లా. ఆవిడ కాఫీ తీసుకవచ్చి ఇచ్చి, 'అన్నగారూ, మి బావగార్ని కాస్త మీరేనా మందలిద్దురూ! చచ్చిపోతున్నాను, సిగ్గేసిపోతోంది; లేకపోతేపిచ్చేమో, ఓమాటు ఏడాక్టరుకేనా చూపించనేనా చూపించండి. ఈయనతోటి పడేబాధ ఇంతా అంతాకాదు. అస్తమానం అవిపాటలుకావు, పద్యాలుకావు, వీధి వీధంతా హోరెత్తిపోతోంది. నలుగురిలోనూ తలెత్తి తిరగలేకుండా ఉన్నాను. అదికాకుండా కుర్రకుంకమావాడు, జ్ఞానమొస్తున్నరోజులు, వాడూ ఇలాపాడైపోతాడేమోనని హడిలిపోతూ రోజూవెయ్యి దేవుళ్ళకి మొక్కుకుంటున్నాను.' అన్నది కళ్లు ఒత్తుకుంటూను. నాకు ఆ అమ్మాయిని చూస్తే చాలాజాలివేసింది. వాడైనట్టైనా, తర్జని గడ్డముమీద పెట్టుకొని 'ఓసివెర్రిదానా! ఎంత అమాయకురాలవు! నావలన పసివాడు చెడిపోవునా! అనగా నేను చెడిపోతిననికదా నీయభిప్రాయము. చెడితినే యనుము- నేనెవరివలన చెడితిని? నాతండ్రివలననా, లేకనీ తండ్రివలననా? ఈ లోకములో ఒకరివలన ఒకరు చెడుట కాని బాగుపడుటకాని ఎన్నటికీ సంభవింపదు. వారివారి...

. . . '' అని ఉపన్యాసము అరంభించాడు. 'చూచారా అన్నగారూ,ఇదీవరస! ఇంకనేను ఏనుయ్యో గొయ్యోచూసుకోవలసిందేకాని ఇలాబతకలే'నని కంటతడిపెట్టుకుంది. నేను తలవాచేటట్లు చీవాట్లువేసివచ్చాను. అంతకంటె ఏమిచెయ్యగలం - చిన్నకుర్రాడు గనుకనా, నాలుగు తగలనివ్వడానికి!

ఒకరోజుమధ్యాహ్నం నేవెళ్ళేసరికి రత్తయ్యా భోంచేస్తున్నాడు. అనగా, విస్తరిదగ్గర కూర్చున్నాడు. మొదటివాయి అయింది. నేవెళ్ళేసరికి కూరా అన్నం కలుపుకుని, ముద్దనోట్లోపెట్టుకుని, తుబుక్కున ఉమ్మేసి అంటచేత్తోటి నొసలు బాదుకొని 'కటకటా! ఎట్టి దురవస్థ! ఊరనిన్ని కూరలుండ, తానీ దిక్కుమాలిన కాకరకాయలేల కొనవలె, కొనెబో నన్నుడుగకుండ ఈ పాడుకూర నేల వండవలె, వండెబో, నాకిష్టములేదని తెలిసియు నాకేల వడ్డింపవలె, నాపై యనురాగమునసో యనసహ్యమునసో వడ్డించెబో, మతిమాలి నేనేల తినవలె, హా! పరమేశ్వరా' అని ఆరంభించాడు. 'వెధవ ఉపన్యాసం కట్టపెట్టి నోరుముయ్యావోయ్' అన్నాను. 'అన్నగారూ చూశారండి, ఈ హంగామా వెధవకూరకోసం, ఈ దిక్కుమాలిన నాటకాలతోటి తమకి ఇంట్లోకి ఏంకావాలో, ఏముందో లేదో తెలుసుకోడానికి తీరికలేకపోయె. అడపీనుగుని ఎన్నిటికని చచ్చేది. కూరలేకపోతే అసలే తినలేరని, వాకిట్లోకి వచ్చాయికదా అని పుచ్చుకొనివండుతే, ఇంత అల్లరెందుకు! ఆ అంటచేత్తో అనెత్తి మొత్తుకోవడ మెందుకు. నేనింక ఒక్కక్షణం ఇక్కడ ఉండను. మావాళ్ళింటికి ఒంటిగంటబండిలోపోతాను. వాళ్లుకాస్త పిండాకూడు పడెయ్యాలేకపోరునాకు. ఇదినాటకంకాదు- ఇల్లనీ, నేను నాటకంలో స్త్రీవేషధారినికాదు-మీభార్యననీ తెలివివచ్చినప్పుడు కాకిచేత కబురంపినా వస్తాను. అందాకామట్టుకు మళ్ళీ ఈగుమ్మం తొక్కచూడను' అని కళ్ళనీళ్ళుపెట్టుకుంటూ రెండుగుడ్డలు మూట కట్టుకుని కుర్రవాడిని తీసుకుని రైలుకు చక్కాపోయింది.

రత్తయ్యా వెర్రిమొగము వేసుకొని దిగాలుపడి కూచు

న్నాడు. 'ఏమిరా ఇప్పుడేనా బుద్ధివచ్చిందా' అన్నాను. 'అవునురాబ్రదర్, కొంచెం అతిగానే వేడుతున్నా ననుకుంటు న్నాను. మామూలుగా ఉందామనే ప్రయత్నిస్తున్నాను. కాని ఇదేబాగా అలవాటు అయిపోయి వదలడంలేదు నువ్వు నన్నువదిలినా, నేనునిన్నువదలనన్న కథలాగుంది నాపని' అన్నాడు. నాటినుంచీ మామూలు పంథాలోకి రావలెనని చాలా ప్రయత్నం చేశాడు. కాని సాధ్యపడలేదు. అలాగే తంటాలుపడుతూ కొన్నాళ్ళకు వెళ్ళి భార్యను తీసుకు వచ్చాడు.

ఇలా ఉండగా కొన్నాళ్ళకు వాడికుర్రాడికి జబ్బుచేసింది. ప్రాణంమీదికి వచ్చిందంటే చూడ్డానికి వెళ్ళాను. నేవెళ్ళిన కాస్సేపటికే ప్రాణంపోయింది. అంతాగొల్లుమన్నారు. పది మందీమూగారు.లోలోపలవిచారించి, అఖరుకు 'హా,తనయా!' అని ఒక పెద్దనిట్టూర్పువిడిచాడు. దుఃఖంలో మునిగి ఉన్న భార్య నిశ్చేష్టురాలై తెల్లబోయి భర్తకేసి చూసింది. జన మంతా వెలవెలపోయారు. రత్తయ్యకు ఇదేమీ తెలియదు. 'తనయా నీనగుమోముచూపి' అని ముఖం ఎత్తబోయేసరికి, 'అఁఅఁ' అనిభార్య వాడినోటిమీద చెయ్యి అడ్డుపెట్టింది. దానితో వాడు తెలివి తెచ్చుకున్నాడు. జరగవలసిందంతా జరిగినతరవాత, ఆవిడపుట్టింటికి వెళ్ళిపోయింది. ఏడాది అయింది, ఇంకారాలేదు. వాడు, పాపం, మునుపటిమనిషే కాదు. కాని ఎన్నిప్రయత్నాలుచేసినా ఇంకామామూలు ధోరణిలోకి రాలేదు.

చూడండి, ఎంతస్వల్ప విషయం ఎంతవరకూ వెళ్ళిందో. ఆరోజున ఒక్కళ్ళమేనా ఇంతవరకూ వస్తుందని కలలోనేనా అనుకోలేదుకదా!

అదే మొదటిసారి నేను Picture Shooting చూడడం. నాకు ఎంతకాలంనుంచో సరదా; ఈ సినిమా చిత్రాలు ఎలా తీస్తారో, ఏంచేస్తారో చూడామని. ఇన్నేళ్లు వచ్చి, ఇంత చదువుచదివి, ఇన్నిదేశాలుచూచి, ఇదొక్కటీ చూడలేక పోవడమనేది చాలా లోపమనిపించింది. కాని అందరినీ చూడడానికి లోపలికి రానివ్వరు. పోనీ ఓపావలో అర్ధోపోతే పోయింది టిక్కట్టుంటే కొని చూద్దామనుకొన్నాను. కాని టిక్కట్లులేవని తెలిసింది. ఏమిటివారని 'ఇతి కర్తవ్యతా' అనేదోపెద్ద సమాస్యముండాలి చూడండి-ఇప్పుడు జ్ఞాపకం రావడంలేదు—ఆ సమాసంలో చెప్పబడ్డ అవస్తలో ఉండగా ఒకపెద్దమనిషి కనపడ్డాడు.

ఆయన ఎవరో, ఏమిటో, ఏమి ఉద్యోగమో, కానయితే నాకుతెలియదు కాని,ఆయనమట్టుకు, చెన్నపట్నంలో అందరినీ ఎరిగినట్లు మాట్లాడుతాడు. ఇంక సినిమా ప్రపంచంలో ఆయునకు తెలియనివాళ్ళు ఉండడానికి వీలులేదనీ, ఈయన లేకపోతే ఒక్కక్షణమన్నా ఆ సినిమావాళ్ళకుగడవదనీ, ఒక్క చిత్రంకూడా ఈయన సలహాలేకపోతే పైకిరాదనీ, ఏవేవో ఇలా కోసేస్తూ ఉండడం చాలాసార్లు విన్నాను. కాని పట్నంలో ఇంత పలుకుబడిఉన్న పెద్దమనిషి, ఒకపూట కడుపునిండా చిరితిండి పెట్టించినా, ఒక్కపావలాకాసు చూపించినా, ఇంక మనవెంట తిరగడం ఆరంభిస్తాడు, పనులు వదులుకొని.

సరే టిక్కటుంటే ఒక అర్ధ ఎలాగు ఖర్చుపెట్ట దలచు కున్నాను కనుక అదికాస్తా ఈ కార్యమేదుకోసం ఖర్చుపెడితే ఒకజీవుడు సంతోషిస్తాడని ఇతన్ని కాఫీహోటలుకు తీసుకు వెళ్లి ఫ్రూటుసలాడ్‌దగ్గర ఆరంభించి పూరీపాటాటో దగ్గిరికి వచ్చినతరువాత, నెమ్మదిగా "ఏమిటిబ్రదర్ – మనమేదేనా

Shooting చూచామా ఏమిటి, ఇవాళ ఏంతోచడంలేదు.'' అన్నాను.

''వెధవ Shooting చూచేదేమిటి పోనిద్దురూ మహా బోరింగుగా ఉంటుంది. మాబోటివాళ్లకు తప్పనిసరి గనుక ఏదో ఏడుస్తూంటాంకాని మీకెందుకీ లేనిపోని బాధా. అంత కంటే ఏదేనా సినిమాకు వెడితే నయం'' అన్నాడు చల్లగా. దానితో నా కాళ్లు చల్లపడ్డాయి; ఇదేమిరా ఇంత టిపినూ తిని అనలెగ్గొట్టి పైగా సినిమా అంటాడేమిటాఅని కొంచెము ఖంగారు పడ్డాను.

''మీరన్నది నిజమే, Shooting మహా చెడ్డన్యూసన్సే! అయినా చూడక తప్పనిసరొచ్చింది. దాన్నిగురించి కొంత తెలుసుకుని ఒక Article వ్రాయక తప్పిందికాదు. ఈ స్వల్పవిషయానికి మిమ్మల్ని బాధించకుండానే కాలక్షేపం చేదామనుకున్నాను. కాని, మీకు మల్లే విషయమంతా సమగ్రంగా తెలిసినవాళ్లు, అది నాబోటివాడికి తెలిసేటట్టు సరిగా చెప్పగలవాళ్లు, అన్ని Studios తోనూ మీకున్నంత Influence ఉన్నవాళ్ళు మరొకళ్లు, కనబడలేదు నాకు, అందుచేత మిమ్మల్ని శ్రమపెట్టక తప్పిందికాదు. ఎందులోనేనా మంచి పేరు ప్రతిష్టలు సంపాదించారంటే ఇలాటి పేచీలు తప్పవు మరి. ఏమంటారు'' అన్నాను. నేను చెప్తుంటే ప్రతిదానికీ ఊరికే చూస్తుండగానే ఉబ్బిపోయి, కొంచెము సిగ్గు అబినయించి, ''ఏమిటిసార్, ఈమాత్రందానికి మీరింత ఇదిచెయ్యాలా, రండి, పోదాం' అని Ovaltine తీసుకొని మిగతా పదార్థాలకు నిట్టూర్పు విడిచి లేచొచ్చాడు.

Taxi పిలుద్దామని ఆయన ఆలోచిస్తుండగానే నేను

రెక్కపట్టుకు లాక్కెళ్లి Bus లో కూర్చోపెట్టాను. నెమ్మదిగా ఒక స్టూడియోకు చేరుకున్నాం. ఏ పేచీలేకుండానే లోపల ప్రవేశించాం. నా మిత్రుణ్ణి దూరాన్నించిచూచే అక్కడ వాళ్లంతా నవ్వుకోడం ప్రారంభించారు. అతను దగ్గరకు రాగానే హేళన అరంభించారు. ఇతనుమట్టుకు పూసుకుని అందరిదగ్గరకూ వెళ్లి అందరితోనూ చాలా చనువుగా ఉన్నట్లు మాట్లాడుతూ అందరూ తనరాకకోసం కనిపెట్టుకున్నట్లు "ఏమిటి ఇంకా ప్రారంభించలేదే! వృధాగా కాలయాపన చేస్తున్నారు. నిమిషానికోరూపాయి పోతుందన్న సంగతి గమనించరేమి!!" అని ఏదో హడావిడి ప్రారంభించాడు. Cameraman లైట్లు సర్దిస్తున్నాడు మనుష్యులచేత వేషాలేసుకుని పాత్రధారులు వెలుతురులో నిలబడ్డారు. Get a baby here అని ఒక కేకవేశాడు, Cameraman. ఓహో ఈసీనులో చంటిపిల్లచేతకూడా నటింపచేస్తారు కాబోలు. బాగుందనుకున్నాను. Get a rifle అన్నాడు. ఇదేమిటి టుపాకులు కాల్చడం హడావిడి ఉంటుంది కాబోలు అనుకున్నాను. Another baby అన్నాడు. ఇదేమిటా తుపాకితో చంటిపిల్లల్ని చంపించడం సీనుకాబోలు! ఎంతఘోరంగా ఉంటుందోఅని భయపడ్డాను. One more rifle అంటున్నాడు. నేను పట్టలేక మామిత్రుణ్ణి అడిగాను. "ఏమిటయ్యా ఈ హడావిడంతాను, చంటిపిల్లల్ని చంపించడమేమిటి? అసలు వాళ్ల ప్రాణానికి ఇన్ని Rifles ఎందుకు? ఏమిటా కథ" అన్నాను.

'చంటిపిల్లల్ని చంపడమేమిటి?' అన్నాడు అతను తెల్లమొహంవేశి.

'మరేమిటో ఇంతవరకు ఇద్దరు ముగ్గురు Babys ని,

నాలుగైదు Rifles నీతీసుకురమ్మన్నాడు,Camera దగ్గర ఉన్నాయన, అన్నాను.

మావాడు పకపకనవ్వి "భయపడకండి, బాలహత్యలూ, భ్రూణహత్యలూ, ఏం జరగవిక్కడ. ఆ దీపాలకీ కొన్నిటికి Baby లు అనీ, Rifles అనీ, డింకీలనీ కిలోవాట్లనీ రకరకాల పేర్లు. అంతకంటే వేరేం లేద"న్నాడు. అప్పటికి నాప్రాణం కుదుటపడ్డది. సరే, ఆదీపం కాస్త ముందుకనీ, ఈదీపం కాస్త వెనక్కనీ, ఇంకొకటి పక్కకనీ, జట్కాబండి వాడు లోపలజనాన్ని జరిపినట్లు జరపడం మొదలెట్టాడు కేమెరా మాస్ గారు. ఇలా సుమారు గంటసేపు పట్టింది.

లైట్లు తయారయ్యాయి అనేసరికి, డైరెక్టరుగారొచ్చి నటకులదగ్గర నిలబడి ఒకమాటు రిహార్సలు చెయ్యమన్నాడు. వాళ్ళు ప్రారంభించారు. నటీనటులు కొంచెం పేరున్నవాళ్ళే. ఒక్కొక్కళ్ళు చెప్పవలసినవి చిన్నచిన్న వాక్యాలే. కాని ఒకళ్ళూ సరిగాచెపుతే ఒట్టు. డైరెక్టరూ, కవీ కలిసి ఐదారుసార్లు చెప్పించారు. ఒకమోస్తరుగా వచ్చింది. ఏక్షను ఏమిచెయ్యాలో చెప్పారు డైరెక్టరుగారు. వాళ్ళు చేస్తుంటే అలాకాదండి ఇలావుంటే బాగుంటుంది అని కవి వచ్చి చెప్పాడు. నటులు మళ్ళీ అలా అరంభించారు. Ast-director వచ్చి, ఈరెంటి కంటెకూడా మూడో రకంగా చేస్తే బాగుంటుందండి, ఆ హిందీపిక్చర్లో వాళ్లు అలాగే చేశారు, అన్నాడు Director తో. అయితే అలా కూడా try చేసి చూద్దామన్నాడు. పాపం డైరెక్టరు మంచివాడు. ఇలా try చేస్తుండగా Cameraman వచ్చి అలాచేస్తే Camera లో బాగుండరు. బొమ్మ అసహ్యంగా ఉంటుంది. ఒకళ్ళకీ ప్రపంచకజ్ఞానం లేనట్టున్న

దేమి,అనిఅయన మందలించి చక్కాపోయాడు. ఏమిటిచెయ్యా డమా అని అందరూ ఆలోచిస్తుండగా, Motor horn లా శబ్దం వినపడ్డది. తరువాత Ready for-monitor please అని Sound engineer గారు పాలికేక వేశారు. దానితో డైరెక్టరుగారు ఉలిక్కిపడి 'చెప్పండయ్యా చెప్పండి ఊరికే Time waste చేస్తూ అలా నిలబడతారేం?' అని నటులనికోప్పడ్డారు. అయన కొంచెంసేపు mike ఇటు తిప్పమనీ అటుతిప్పమనీ, కిందకనీ, పైకనీ, కిందామీదా పడ్డారు. సరియైన పొజిషన్‌లో ఉంచనుకునేసరికి Field లోకొస్తాం దన్నాడు Camera man గారు. సరే మళ్ళీ కాస్తపైకెత్తి నటులను మాట్లాడించారు. నెమ్మదిగా అనీ, గట్టిగా అనీ, కోపంగాఅనీ, సాఫీగాఅని సరిగ్గావాళ్ళచేతను అనిపించేసరికి అరగంట పట్టింది. ఏమిటిగొడవ ఎరక్క పోయివచ్చాం, పోదామా అనిపించింది నాకు.

ఎలాగైతేనేం Ready for take అన్నారు. సరే దీపాలన్నీ వెలిగించి, నటులదుస్తులూ, విగ్గులూసర్ది, ముఖాన్ని పౌడరుఅద్ది, నాలుగుసార్లు రెడీ అని పదిసార్లు Silence అని, ఆఖరుకు Start Please అన్నారు డైరెక్టరుగారు, Camera బుర్రుమని తిరగడం ప్రారంభించింది. Clap కొట్టాడు. ఎవరో ఒకరు తుప్పు క్కున తుమ్మారు. Cut అనికేకేశాడు డైరెక్టరు గారు. ఎవరయ్యా ఆ తుమ్మింది! అని ఉరిమారు. గుళ్లో అపానవాయువు విడిచిన వాడిలాగ ఒక్కడూ మాట్లాడ లేదు. మళ్లీ Lights on, Silence, Ready, Start please అన్నారు. Start చేశారు. మళ్లీ Cut, Cut, Cut, అని కేకేశారు. ఏమంటే Heroine పమిట ఎక్కడో

కాస్త మడతపడిందిట. అదినర్దడం కోనం. పునః ప్రాణా నామ్య అని మళ్లీ Start అన్నారు. మళ్లీ Cut అన్నారు. మళ్ళీ ప్రారంభమయింది. Actor చెపుతున్నాడు. కవి 'అ అ' అలాకాదని కేకేశాడు. మళ్ళీ Cut అన్నారు, 'నిక్షేపంలా చెపుతున్న వాడిని అపుతావేమిటయ్యా, బాగున్నది, నాకు తెలియదా. నీ కెందు కనవసరంగాను' అని డైరెక్టరుగారు కవిమీద కారాలూ మిరియాలూ నూరారు. మళ్ళీ ప్రారంభం Start please అన్నారు. మళ్ళీ మొదలెట్టారు. చివరపరకూ చెప్పారు. Sound Engineer గారు బాగాలేదన్నారు. Volume తగ్గిపోయిందన్నారు. మళ్లీ Retake అన్నారు. మళ్లీ ఒకసారి monitor అన్నారు. అయింది. Silence-everybody అన్నారు. ప్రారంభించారు. వాక్యం మధ్యలో హీరోయిన్ ముక్కుమీద ఈగవాలి కితకితలెట్టింది. దానికేం తెలుసు పాపం ఇది Retake అని. డైరెక్టరుగారు చెప్పుచ్చుకున్నారు ఈగనుకొట్టడానికి. హీరోయిన్ మీద ఏమివాలినా ఊరుకోరు ఆయన. అవసరం లేకుండానే హీరో యినే వాలా హీరోయిక్‌గా దాన్ని తోలేసింది. cut అన్నారు. మళ్ళీ ప్రారంభించారు. ఇన్నిసార్లు చేయించినా వాళ్లుచెప్పే పద్ధతీ, చేసేపద్ధతీకూడా బాగాలేదండీ అన్నానేను మా స్నేహితుడితో. అవునండీ అదే నేనూ అనుకుంటున్నాను. ఇలాగే ప్రతీదీ తగలేస్తారు. వాళ్ళకితోచదు, చెపుతే వినరు అన్నాడు.

అయినా మీరు చెప్పిచూడండి, మీరు చెపితే వినక పోవడమేమిటి అన్నాను.

మళ్లీ Retake ప్రారంభించారు. మధ్యలో మావాడు లేచి పాపం Rehearsal అనుకున్నాడుకాబోలు 'అబ్బబ్బా!

అలాకాక్కదయ్యా' అన్నాడు. అందరూ మాకేసిచూశారు. cut అన్నారు. దీపాలార్పివేశారు. డైరెక్టరుగారు ఒక్క అంగలో మావాడి దగ్గరకొచ్చి, నీకేమైనా బుద్ధుందాలేదా? నిన్నెవడురమ్మన్నాడిక్కడికి? వచ్చినవాడిని పొమ్మనడ మెందుకని మేము మర్యాదగా ఊరుకుంటే ఏమిటాఅల్లరి. నిన్నెవడడిగాడు? నీకేం తెలుసునని చెప్పొచ్చావని చెడాబడా తల వాచేటట్టు పెట్టారు. చెయ్యికూడా చేసుకుంటారేమోనని భయపడుతూ నేను నెమ్మదిగా ఎవరూ చూడకుండా ఇవతలికిజారాను.

అదే మొదటిసారి నేను షూటింగ్ చూడ్డం.

తానొకటి తలుస్తే దైవమొకటి తలుస్తాడని....ఈ చిన్న అవాంతరమే రాకుండా ఉంటే చరిత్ర మరొక మోస్తరుగా వ్రాయవలసి ఉండేది. అంటే ప్రపంచ చరిత్ర అని కాదు సుమండి నా అభిప్రాయం–సౌదామనీ ఫిలింకంపెనీ చరిత్ర. అందులో కొందరు వ్యక్తుల జీవిత చరిత్రలు అని నాఉద్దేశం. ప్రపంచ చరిత్ర అంటే మట్టుకెంత-ఇలాటివి పది చరిత్రలైతే ఒక ప్రపంచ చరిత్ర అంత అవుతుంది.

మొదటే చెప్పాను కదూ! ఈ తారుమారుకు కారణం ఒక చిన్న అవాంతరమని. ఈ అవాంతరం రావడానికి కూడా కారణాలు లేకపోలేదు. మొదటిది వాస్తవికతయందు నారాయణన్‌కున్న అభిమానం, రెండవది నాయికకు ఉద్రేకాలన్నీ ఉడిగిపోయాయి అనుకోవడం, మూడవది అనుభవంలేని నాయకుడు ఉండడం మంచిదనుకోడం, నాలుగవది సరే! ఇలాగే ఏవేవో ఉన్నాయనుకోండి. అసలు విషయం చెపుతే మీకే తెలుస్తుంది. సౌదామనీ ఫిలిం కంపెనీ మంచి ముహూర్తాన్ని ప్రారంభించబడింది. సౌదామనీ కంపెనీకంటె నారాయణన్ సంగతి ముందుమీకు చెప్పాలి. సౌదామనీ అంటే నారాయణన్ సృష్టి అన్నమాట. అతని నిరంతరకృషి ఫలితం–కొన్ని సంవత్సరములు అతను దివారాత్రములు కన్న కలలు నేటికి సౌదామనిగా మూర్తీభవించినా యన్నమాట. అతనిపేరు హలంతమైనంత మాత్రాన తెలుగువాడు కాడనుకోనక్కరలేదు. తెలుగువాడినే నని అతను చెపుతున్నప్పుడు మనం నమ్మవలసినదే. అతని విద్యతోటికాని మతంతోటికాని మనకు నిమిత్తంలేదు. సినీమాడైరెక్టరు కాదలచుకున్నవాడికి ఈ రెండూ అవసరంలేదని నారాయ

ఖన్ చాలాసార్లు అంటుండగా విన్నాను. అనగా ఇటువంటి సంకుచితమైన హద్దుల్లో ఇమిడిపోకూడదు, ఏడైరెక్టరూనని అతని భావమని వ్యాఖ్యానంకూడా చేసిచెప్పాడు.

అతను అవిరతోత్సాహి అని దేశానికంతకూ తెలుసును. సినీమాకూ జీవితానికీ అవినాభావమనీ ఒకటివినా రెండవది ఉండదనీ ఒకటి రెండవవానికి మెరుగుపెడుతుందని ఇత్యాది మహద్విషయాలను గురించి అతను ఇచ్చే ఉపన్యాసాలకు ప్రతి ట్రాం, బస్సు, రైలు, కాఫీ హొటలు, పార్కు, లాంతరు స్తంభం వగైరాలు ప్రబలసాక్షులు. వీటిలో దేన్ని కాస్త మోగించినా, ప్రణవంలాగ నారాయణోపన్యాస ధ్వనులు వినిపిస్తాయి. ఇటువంటి అవి రతోత్సాహి, ఉద్రిక్తహృదయుడు, సినీమాధ్యాని, యోగి, తన జీవితాన్ని సినీమాకళకు అంకితంచేసి అర్పించాడంటే ఆశ్చర్యమేముంది. వెంటనే సినీమాకంపెనీ ఒకటి ప్రారంభించాలని సంకల్పించాడు. ఏ కార్యమైనా తారాబలంలేనిదే జయప్రదంగా జరగదుకదా. అందులో సినీమాకంపెనీ అసలే జరగదు. అందుకని తారాన్వేషణ చేశాడు. సంకల్ప సిద్ధుడు కనుక వెంటనే, ఇతను కోరిన, స్వప్నించిన ధ్యానించిన మూర్తిలాంటిదే ఒకతార మెరుపులా ఇతనికంటికి కనుపించింది. ఆవిడ, ఎవరో ఏం చేస్తుండేదో అదంతా మనకు అవసరంలేదు. ఆ మాటకొస్తే ఏ తారమట్టుకు పూర్వాశ్రమంలో ఎవరంటే ఏం చెప్పగలం. చెప్పగలుగుతే మట్టుకు ప్రయోజనమేముందీ! లక్ష్మీకాంతం గతి తప్ప! అందుకనే తారలకు భవిష్యద్వర్తమానములే కాని భూతకాలం లేదన్నారు శాస్త్రజ్ఞులు. ఈవిడకుగూడా – సౌదామని అని ఇతనే నామకరణం చేశాడు—అదివరకు తారకా దుకాని

ఇతని కన్నుపడిన క్షణమందే, ఆవిడకు తారత్వం సిద్ధించింది.

తారాబలం కుదిరింది కనుక, ఇంక చంద్రబలం అనగా ఆర్థికబలం చూడవలసి వచ్చింది. చక్కనితార, చురుకైన తార, అనుకూలవతిఅయిన తార చేతులో ఉన్నప్పుడు, వెధవడబ్బు, డబ్బుకేంలోటు, దానంతటదేవస్తుంది; వచ్చింది కూడాను. తారలలోఉండే విశేషమే అది. ధనాకర్షణ ధనార్జన.

ఒక పెద్దమనిషి, నారాయణన్ లెక్చరు నాలుగునిమిషాలు విని, సౌదామినిని నాలుగుసెకండ్లు చూచేసరికి, తన 50 సంవత్సరముల జీవితం, 50 లక్షల కష్టార్జితం వ్యర్థమనీ, ఇకనైనా కొంత ఈ కంపెనీకి సహాయంచేసి జీవితం ధన్యం చేసుకుంటేనే కాని వీలులేదని నిశ్చయం చేసుకున్నాడు.

ఇటువంటి మూర్తి త్రయంచేరినప్పుడు, ఇన్ని అనుకూల పరిస్థితులు ఏర్పడ్డప్పుడు సంకల్పితకార్యం, నిర్విఘ్నంగా దిగ్విజయంగా జరుగుతుందని అందరూ అనుకున్నారంటే ఆశ్చర్యమేముంది. జరగవలసిందే కూడాను, ఈ ఒక్క అవాంతరం రాకుండాఉంటే; — అనేక వాదోపవాదాలయిన తరువాత, నారాయణ కృతోపన్యాస శతములు విన్న తరువాత, సౌదామిని, చురుకు, చమక్, ఉత్సాహం చూచిన తరువాత రెడ్డిగారుకూడా (అనగా మన కుబేరులు) సాంఘిక చిత్రానికే వోటు ఇచ్చారు-అందుకు హీరోను ఒక యువకుడిని సంపాదించాడు నారాయణ...కాదు సౌదామిని.... కాదు, సరే! ఎవరి ప్రజ్ఞఅయితే మనకేం. చాలాచక్కనివాడు-చాలా తెలివైనవాడు—అప్పుడే B. A., (Hons) ప్యాసయ్యాడు. చాలా అమాయకుడు, ఈ కాలంమనిషి

కాదు. ఈ కో-ఎడ్యుకేషన్, సినిమా, నాటకాల రోజుల్లో కూడా ఏవిధమైనా స్త్రీస్పర్శ ఎరుగనివాళ్ళున్నారంటే మీరు నమ్మాలి. మన కరుణకుమార్ అందుకు ప్రబలనిదర్శనం.

రిహార్సల్సు పూర్తిచేసుకుని మంచిముహూర్తాన షూటింగు ప్రారంభించారు షూటింగు జోరుగా జరుగుతోంది. ఉజ్వల చిత్రం తయారవుతోందని, వెండితెరకు కొత్తవెలుగు వస్తోందని, ఆంధ్రులకు నూతన కానుక రానున్నదని, ఆంధ్రదేశంలోని మొదటి oomph girl అనీ, ఇంత sex appeal ఉన్న తార హాలీవుడ్డులోకూడా లేదని రకరకాలుగా పత్రికలలో రిపోర్టులు పడుతున్నాయి. ఈ గందరగోళంలో ఒకనాడు సౌదామనీ కంపెనీలో ఏదో వచ్చి షూటింగు ఆగిపోయిందని పుకారు బయలుదేరింది. దేశం అట్టుడికినట్లు ఉడికిపోయింది. రష్యన్లు బర్లిన్లో ప్రవేశిస్తే మాకేం—ప్రవేశించకపోతే మాకేం అన్నంత వెనక్కుపోయాయి యుద్ధవార్తలుకూడాను. పత్రికలవాళ్లంతా స్పెషలు ఏజంట్లను పంపించారు. ఈసంగతేమిటో తేల్చడానికి-వీళ్ళంతా స్టుడియోను ముట్టడించి నాలుగురోజులు నానా అవస్థలూ పడ్డతరువాత డైరెక్టరు నారాయణన్, యజమాని రెడ్డిగార్లు వీళ్ళందరనూ పిలిచి, చిన్న Press conference జరిపి ఒక స్టేటుమెంటుఇచ్చారు, దాని సారాంశమిది.

"....కథ కంతకనూ ముఖ్యమైనసెట్టులో షూటింగు జరుగుతోంది. ఆవేళరాత్రి షూటింగు మంచి లవ్‌సీను, లవ్‌చాలా నేచురల్‌గా ఉండాలని నారాయణగారి అభిప్రాయం, అది సహజంగా లేకపోవడం చేతనూ అందులో అవసరమైనచోట్ల ఆలింగన చుంబనాదులు లేకపోవడం చేతనూ,

తెలుగు ఫిల్ములు పాడైపోతున్నాయనీ, ఆ లోటు మనం తప్పక తీర్చవలెననీ నారాయణగారు చాలా కృషిచేశారు. నటీనటులకు నచ్చ చెప్పారు. అందుచేతనూ ప్రతివాళ్ళు ఆలింగనాదులు యధేచ్ఛగా సాగించారు. కాని. మా హీరో మట్టుకు సిగ్గుపడడం మొదలుపెట్టాడు. రిహార్సులులో యెప్పుడూ ఏమీ చెయ్యలేదు. సెట్టుమీద చెయ్యవలసినంతా చెయ్యక పోతాడా అనుకున్నాం... సీను కొన్నిషాట్లు అయి నాయి. రాత్రి 12-30 అయింది. కథ కంతకూ అయువు పట్టయిన షాట్ ప్రారంభమైయింది. నాయకుడు నాయికను ఎలా ఆలింగనం చేసుకొవలసింది, ఎలా ముద్దు పెట్టుకోవల సినది, డైరెక్టరుగారు బాగా చెప్పారు-హీరోకిబాగా తెలియడా నికి రెండు మూడుసార్లు చేసి చూపించారు. హీరోను చెయ్య మంటే సరిగా చేయలేకపోయాడు. నాయికలోపం ఎంత మాత్రంలేదు, ఆవిడ ఎన్నివిధాల ప్రోత్సహించినా నాయకుడు భయపడుతూ వచ్చాడు. ఏమయ్యా అంటే అంత తారామ ణిని— ఎలాగ సార్—ఆవిడకు 5000 జీతం నాకు150 అయిరి. ఆవిడను—ఎలాగండి-ఇంతమందిలో మరీని అన్నాడు భయపడుతూ—.

నాకేం భయంలేదని రెడ్డిగారు రెండుమూడుసార్లు చేసి చూపించారు. అప్పటికీ ఇతనికి బాగా చేతకాలేదు. అసి స్టెంటు డైరెక్టరు ఒకసారి చేసి చూపిస్తానన్నాడు. ఇతని కెలాగైనా బాగా నేర్పవలెనని ప్రతివాళ్ళూ చేసి చూపిస్తామ న్నారు కాని, డైరెక్టరూ నాయికాకూడా అంగీకరించలేదు.

షూటింగు ప్రారంభించారు. ఎనిమిది రీటేకులయినాయి, డైరెక్టరుకు కోపమొచ్చింది. ఈసారి సరిగా చెయ్యకపోతే నాయకుడిని డిస్మిస్ చేస్తానన్నాడు. నాయిక నాయకుడుని

లాలించి భయపడవద్దని ధైర్యంచెప్పి మళ్ళీ ఎలా చెయ్యాలో అతనిచేతులూ అవీ మీదవేసుకుని నేర్పింది....

రెడీ అన్నారు. నాయకుడు సిద్ధపడ్డాడు. రాత్రి ఒంటి గంట దాటింది; నాయకుడికి ఒళ్ళుమండింది. ఎలాగైనా ఈసారి బాగా చేసి తీరాలనుకున్నాడు. ఇన్ని రిహార్సల్సు తోటే, ఈ దీపాలకాంతితోటీ, నాయిక ఉత్సాహవచనాలతోటీ ఒళ్ళు వేడెక్కిపోయి ఘాటైన విస్కీ అంత పని చేసింది. Shoot అన్నారు. నాయకుడు అనవలసిన మాటలు మర చిపోయి నాయికను తన శక్తికొద్దీ కౌగలించుకున్నాడు. ఆవిడ ఉక్కిరిబిక్కిరై 'క్రిక్' అంది. నాయకుడు ముద్దుల వర్షం కురిపించాడు. ఆవిడ మొదట నిమ్మళంగా హాయి హాయి అన్నా ఊపిరాడక "ఉండండి అబ్బ ఒక్కమాటా గండి" అన్నది.

డైరెక్టరు రుద్రుడైపోయి కట్ అని ఒక్క ఉరుము ఉరి మాడు. అంతా నిశ్శబ్దం, 'ఏమయ్యా ఇలా తగలేస్తావు' అన్నాడు నాయకుడిని, గుడ్లెర్రచేసి. 'ఏమండీ ఈ పాటూబాగా లేదా సార్' అన్నాడు, దీనవదనంలో, అవిడను కౌగిటిలో నుంచి వదలకుండానే.

'బాగేమిటి నీబొంద మాటలేవి' అన్నాడు. "అరెరె కాని అలాంటప్పుడు మాట లెలాగండి" అన్నాడు అమాయకంగా. అసిస్టెంటు డైరెక్టరొచ్చి నెమ్మదిగా కౌగలిపట్టు వదలించాలని ప్రయత్నం చేశాడు. నాయికే అతన్ని అవతలికి ఒక్క గెంటు గెంటి, తోకతొక్కిన తాచులాలేచి, "ఏమిటి సార్ మీతోటి అన్నీ పేచీలేను; వారన్నట్లుగానే అలాటప్పుడు మాట లెలావస్తాయండి. బుద్ధిలేక కవిగారు రాస్తేమట్టుకు మీకేనా తెలియొద్దా. లేనంతసేపు ఎలాగూలేదు. అయన దారిన

పడి సరిగ్గా చేసేసరికి Cut అని సీనంతా తగలేశారు, పైగా పాపం అయన్నంటారేం" అని నాలుగు ఉరుములు ఉరిమి 'రండిసార్ మనం పోదాం, మనం వేరే కంపెనీ పెట్టుకుందామ'ని నాయకుడిని లేవతీసుకుపోయింది. ఇంతవరకూ వాళ్ళజాడ తెలియలేదు.

ఇదీ జరిగిన సంగతి. ఇలా జరుగుతుందని ఎవరనుకుంటారు. ఈ అవాంతరమే లేకపోతేనా....

# తుదిపలుకు

ఈపుస్తకంలో కథల కథ టూకీగా రెండుముక్కలలో మనవిచేస్తాను. లేకపోతే బాగుండదు.

'బండసుబ్బడు' అనేకథకు మాతృక H. G. Wells వ్రాసినకథ. దానిపేరు నాకు జ్ఞాపకంలేదు : జ్ఞాపకమున్న కథావస్తువును మాత్రముపయోగించుకొని నాధోరణిలో నేను వ్రాశాను. అలాగే 'లాభసాటి బేరాలు' అనే కథ Jenkin's whiskers అనికాబోలు, ఎక్కడో కథలసంపుటిలో చదివిన కథ నాధారం చేసుకుని నడిపాను.

'నేనూ మా ఆవిడా' ఏనాడోవ్రాశాను. అప్పుడు సాహితిలో పడ్డది. నేనువ్రాసినరెండోకథ ఇది. సామాన్య సంసారి ఒక్క దాంపత్య జీవితంలో ఉండే హాస్యమును ఈరకంగా, చిత్రిద్దామనుకున్నాను. ఈభావం కలగడానికి కూడా Barry Pain లాంటి రచయితల అద్భుతరచనలు ఆధారాలు. ఈ కథా, మరొకటీ తీసుకువెళ్ళి కొడాలి ఆంజనేయులుగారికి చదివి వినిపించాను. అప్పుడు సాహితీ సంపాదకుడు ఆయన. నా అభిప్రాయమంతా చెప్పాను. చాలా బాగుందనీ, తప్పక వ్రాయమనీ, సాహితిలో నెలనెలా వేస్తాననీచెప్పారు. తరువాత సంచికచూస్తే 'నేనూ మాకాంతం' అని కనుపించింది. అతరువాత నాకథపడింది. అక్కడ నుంచి వరుసగా కాంతం నెలనెలకూ బయటకు రావడం ఆరంభించింది. చూడగా, నామిత్రులు, మునిమాణిక్యం గారే నాకంటే బాగా రాసేటట్టున్నారు. ఆయనతో మనకు

పోటీ ఎందుకని నాప్రయత్నం విరమించు కున్నాను....
అప్పటికి. ఈ పుస్తకం ప్రారంభంలో ఆనాటి కథలన్నీతీసి వెతకడంలో ఇదీ దొరికింది. మావాడుచదివి ఇదీ బాగుంది. వెయ్యమని అచ్చుకిచ్చాడు. ఆకథవెనక నింతకథ ఉన్న సంగతి వాడికేంతెలుసు.

'ఆకాశసౌధాలు' 1937 లో కాబోలువ్రాశాను. అప్పటికి మొదట కాంగ్రెసు ప్రభుత్వం, శ్రీమాన్ రాజగోపాలాచార్యుల వారి అధ్వర్యాన జరుగుతోంది. మొదటిసంవత్సరమే డబ్బు లేక ప్రజలను అప్పు అడిగారు. 24 గంటలు వ్యవధి ఇచ్చినా 16 గంటలలో కాబోలు వారికి కావలసిన మొత్తం వచ్చింది. రెండోసంవత్సరం కొత్తపన్నులు విధించారు. అప్పుడు వచ్చినవే, ఈపొగాకుపన్ను, సేల్సుపన్ను, వినోదాల మీదపన్ను వగైరా. ఈ ఆదాయంచాలక మళ్ళీ అప్పుకు బయలుదేరారు. ఈసారి అనుకున్న మొత్తం అందలేదు. సరే, తరువాతనెవరో అడ్డుపడి, మీకేంభయంలేదని హామీ ఇచ్చారు. వ్యవహారం నడిచిపోయింది. ఆ సందర్భంలో వ్రాసినదీకథ. ఇందులో వచ్చినపేర్లుగల పెద్దమనుష్యులం దరిమీదా నాకుచాలా గౌరవమే. ఇక్కడ ఊరికే కులాసాకు వ్రాసేనేకాని వారినేమీ అందామనికాదు. అందుకని వారు నామీద ఆగ్రహించరనుకుంటాను. అప్పటి వాతావరణం తెలుస్తే కథ ఎక్కువబాగా రక్తిగా ఉంటుందని ఇదివ్రాస్తు న్నాను.

అలాగే 'గాజుపాలెం గాంధీ' ని గురించికూడా రెండు ముక్కలుచెప్పాలి. చాలాకాలంనాటిసంగతిది. 'త్రిపుర' లో కాంగ్రెసు జరిగింది ఆసంవత్సరం. అధ్యక్షపదవికి పెద్ద పోటీ వచ్చింది. పట్టాభిగారి పట్టు సాగిందికాదు. సుభాస్

చంద్రబోసుగారు అధ్యక్షపీఠం అలంకరించారు. మహాత్ముని గురించి మామూలు మానవులు ఈనాడుకూడా ఏమీ అన కూడదుకాని, నాకుసత్యం అనితోచిందది వ్రాయడంలో తప్పు లేదనుకున్నాను. గాంధీగారి పరాజయాన్ని సహించలేక పోయారు. కోపగించి సభకురాసన్నారు. త్రిపురలో సుభాస్ 104 డిగ్రీల జ్వరంతో,అయాసంతో,నీరసంతో,సభకు అధ్యక్షత వహించాడు. ఆసేతు హిమాచలం హర్షించింది. ముప్పై మూడుకోట్ల భారతీయులదృష్టి త్రిపురమీదవాలింది.

గాంధీగారిది బాగుందికాదనుకున్నారు. ఈ దృష్టిసక్కడ నుంచి మరలిస్తేనేకాని చాలాచిక్కులు వస్తాయనుకున్నారు. తిన్నగా రాజకోటకు ప్రయాణంకట్టారు అక్కడే పల్లపమేరీ లేవదీసి నేను సత్యాగ్రహం చేస్తున్నా నన్నారు. అక్కడ రాజూ, మంత్రి దర్బారువారివల్లా ఈయన్ను ధిక్కరించారు. సత్యాగ్రహం పనిచెయ్యలేదు. ప్రధాన న్యాయమూర్తి Sir Maurice Gwyer ధగ్గర తగువుకు వెళ్ళారు. ఆయనతీర్పు అదోరకంగాచెప్పారు. ఈలోపున త్రిపురలో కాంగ్రెసు అయిపోయింది. చక్కపెట్టవలసిన వ్యవహారాలు చాలా ఉండిపోయాయి. అందుచేతను, 'మీకర్మంమీది. మీ ఇష్టంవచ్చినట్లు ఏడవండి. మీగొడవ నాకెందుక'ని రాజ కోట ప్రజలనూ, తోటిసత్యాగ్రహులనూ నట్టేట్లోవిడిచిపెట్టి లేచి చక్కావచ్చారు, గాంధీగారు. ఈ హంశాన్ని విషయంచెప్ప కుండా, అంతా అవగాహనయ్యేటట్లు హాస్యంగా వ్రాశాను.

రాజకీయాల్లో, సాంఘికవ్యవహారాల్లో, వ్యక్తుల ఆచార వ్యవహారాలలో, నడవడులలో వేషభాషలలో, ఉండే చిత్రములనూ, తారతమ్యాలనూ చూపించడానికీ, మార్చడానికీ హాస్యం ఎంతో ఉపకరిస్తుంది. వ్యక్తులమీద రాగంకాని,

ద్వేషంకాని, ఆగ్రహంకాని, అనుగ్రహంకాని లేకుండా దూరా న్నుంచిచూస్తే కనపడే అవకతవకలనుమాత్రం ప్రదర్శిస్తుంది హాస్యం. అందుకని ఎవ్వరికీ బాధ ఉండదు.

మనపెళ్ళిళ్ళలో మగపెళ్ళివారు కోలాహలంగా తరలి వెళ్ళడం, పేచీలు పెట్టడం వగైరా 'మాబావమరదిపెళ్లి'లో ప్రదర్శించాను, అనేకచోట్లమనకు ప్రత్యక్షమయ్యే అమాయ కపుభర్త, గండ్ర అయినభార్య, 'జన్మనక్షత్రపలం'లో కనపడతారు.

మీరు ఎరిగున్న ఎంతోమంది నటకులు 'రత్తయ్య' లో మీకు కనిపిస్తారు. మద్రాసువాసులూ, సినిమాజీవులూ 'అదేమొదటిసారి', 'అనుకోని అవాంతరం' లో ఉండే సార స్యంగ్రహిస్తారు.

నేనింవాకా మనవిచేసినట్లు, హాస్యరచయితకు వ్యక్తుల మీద ద్వేషంకాని కోపంకాని ఉండదు. అందుచేత నాకథ లలో కనపడే వ్యక్తులలాటివారి మీద నెవ్వరిమీదా నాకు కోపం ఎంతమాత్రంలేదు, సంతోషమేకాని. సరేనా.

